ఆంధ్రసచిత్రవార

# పత్రిక

7-12-62

"బంధువులా-బంధాలూ"

25 నయాపైసలు



# త్వరలో ప్రారంభం!

## ఆంధ్రసచిత్రవారపత్రిక పోటీలో

## రెండవ బహుమతి నవల

రచన: రంగధామ్

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ముఖచిత్రం బాగున్నదనే చెప్పాలి. కాని సినీ నటుడు పద్మనాభం బుగ్గమీదను చేయివేయటం, బాగులేదు.

పి. యస్. దీక్షితులు (పర్లాకిమిడి)

*   *   *

పద్మనాభంగారికి వివాహమైందా ? పిల్లలు ఎందరు ? మీరు ఈ విషయమును పరిచయంలో తెలియపర్చలేదు. ఎందుకు ?

కుమారి తంగిరాల కమలాదేవి (బాపట్ల)

*   *   *

ఆంధ్రా జెర్రీలూయిస్ అయిన పద్మనాభంను పరిచయము చేసినందుకు ధన్యవాదాలు.

రాధాబాయి (కాకినాడ)

*   *   *

'రాణింపుగల నటి— రాజశ్రీ' అన్నశీర్షిక క్రింద వర్ధమాన నటి, రాజశ్రీని పరిచయం చేసినందుకు "సు" గారికి మేమంతా ఎంతో ఋణపడివున్నాము. ఆంధ్రుల అభిమానతార కుమారి రాజశ్రీ ఇంత చిన్నవయస్సులోనే ప్రేక్షకుల అభిమానం పొందినందుకు ఆమెను అభినందించక తప్పదు. ముందుముందు ఆమె నిత్యనూతనోత్సాహంతో తన నృత్య నటనాకౌశలాలతో ప్రేక్షకులను ఆనందాబ్ధిలో ఓల లాడిస్తుందని నమ్ముతున్నాను.

కాని, ఒక చిన్న మనవి. 16వతేదీ పత్రిక. 45వ పేజీలో ప్రచురింపబడ్డ రూపగారు తీసినఫోటో మాత్రం చాలా అసభ్యంగా ఉంది. ఆంధ్రుల అభిమానతార, ఆంధ్రుల ఆడపడుచు అయిన కుమారి రాజశ్రీ ఈ ఫోటోకు ఇటువంటి "పోజు" ఇవ్వటం, ఆంధ్ర సంస్కృతికి ప్రతిబింబంగా పరిగణింపబడుచున్న మీ పత్రికలో అటువంటి ఫోటోకు తావు ఇవ్వటం చాల విచారించవలసిన విషయం. ఇది ఆంధ్ర జాతికి తీరని అవమానం. ఈ విధమైన ఫోటోలు ఇకముందు ప్రచురించరని ఆశిస్తున్నాను.

మా. హనుమంతరావు (అనంతపురం)

## విచిత్ర వివాహం

మీరు ఇండియనేనా 'యూ'గారూ ? ఇండియాలో ప్రయివేటు డిటెక్టివ్ లున్నారా ? మీకథలోని పేర్లన్నీ అసలైనవేనా ? మీ రీ 'యథార్థ గాథను తెలుగులోనే రాసి పంపారా మా పత్రికకు?

పి. కళ్యాణచక్రవర్తి (ఒంగోలు)

'యు.' భారతీయులే. మద్రాసులో ఉంటున్నారు. వీరికి తెలుగు వచ్చు!

*   *   *

యథార్థ అపరాధ పరిశోధక గాథ శ్రీ 'యు' గారిది ప్రచురిస్తున్నందుకు చాలాసంతోషం.

జి. కృష్ణఫణి (పాశర్లపూడి)

★

SISTA'S-SG-173A TEL



# టినోపాల్ మాత్రమే బట్టలను అదనంగా తెలుపు చేస్తుందని తెలివైన తల్లులకు తెలియును!




టినోపాల్ యిచ్చే మెరుగును పెట్టండి తళతళలాడే తెల్లని యూనిఫార్మ్ తొడుగుకొన్న మీ పిల్లలను చూడడానికి ఎంతో ముచ్చటగా ఉంటుంది. తెల్లని దుస్తులకు కళ్లు మిరుమిట్లు గొలిపే అదనపు తెల్లదనము కలిగించుటకే టినోపాల్ ప్రత్యేకముగా తయారు చేయబడినదని తెలివైన తల్లులకు తెలియును.

ఎంతో పొదుపు కూడ

టినోపాల్ మెరుగు పెట్టుకొనుటకు మీకు ఏమీ ఎక్కువ ఖర్చు కాదు. ఒక బాల్చీడు బట్టలను తెల్లగా చేయుటకు టీ చెంచాలో నాలుగోవంతు టినోపాల్ మాత్రమే చాలును! టినోపాల్ యిచ్చే తెల్లదనము త్వరగా పోదు; మీరు బట్టలను ఉతుక్కొనే ప్రతిసారి టినోపాల్‌ను ఉపయోగించ నక్కరలేదు.

జ్ఞాపకముంచుకోండి–




టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఏ. బాస్లె, స్విట్జర్లాండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్క్.

ఉత్పత్తిదారులు:
స్వహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా



సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్ట్ బాక్స్ 965, బొంబాయి-1 బి.ఆర్.

ఆంధ్రసచిత్రవార
# పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం: 7—12—62
శుభకృత్ సం॥ మార్గశిర ॥ శు॥ ఏకాదశి
సంపుటము: 55 సంచిక: 14
స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా: రూ. 13.00 ఇతర దేశాలు: ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

*

విడిప్రతి: 25 న.పై.
సంవత్సర చందా: 13.0.0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1



"మదనకామరాజు కథ"లో మీనాకుమారి.

## మనలోమాట

ఆంధ్ర సచిత్ర వార పత్రిక పేజీల సంఖ్య ఎందుకు తగ్గించవలసి వచ్చిందో చెబుతూనే ఉన్నాము. ఈ తగ్గింపు అనివార్య కారణాలవల్ల జరుగుతూ ఉన్నప్పటికీ 'పాఠ్యవస్తువు' తగ్గకుండా ఉండేందుకని ఆంధ్ర సచిత్ర వార పత్రిక కాలం (Column) నిడివి అధికం చేయదలచాము. ఇది వీలయినంత త్వరలో చేయగలము.

## లోకంపోకడ



గీత: నేను మూడుసార్లు దేశరక్షణ నిధికి రక్తదానం చేశాను.

సీత: అంతేనా? నేను మూడువందల తులాల బంగారం నగలు యిచ్చేశాను తెలుసా?



## విషయానుక్రమణిక






చైనావాడి ఒప్పందం సూత్రాలు
చైనా
చందమామ చాలాదూరంగా వున్నాడు!
చైనా
రస్సెల్
సలహాలు
సలహాలు
ఇదో బాంబ్ లా వుందే!
మీరు నా కోర్కెలు తీర్చకపోతే ఈ కత్తితో పొడుచుకు ఛస్తా....
అమెరికా
చైనాతో పరస్పర సహాయసంధి అనే కత్తి
పాక్
మునిగే నౌక...
భారత కమ్యూనిస్టు పార్టీ
ఇక ఈ నౌకలో వుంటే ప్రాణాలు దక్కవు
వదిలేద్దాం

# కథగా మారిన ఆర్. టి. సి. బస్సుల తీరు

ఐ. ఎల్. ఎన్.

శీతాకాలపు యెండ చుర్రుమంటూ చలి విరిచేస్తోంది. నారాయణగూడా వెళ్లటానికని, కోటీ బస్సుస్టాండు దగ్గర నిలబడ్డాను. ఆ పొడుగూ పొడుగునా, ప్రయాణికులు నిలబడటానికని, షెడ్లు కట్టారు. బస్సు నెంబరు బోర్డు తగిలించి, ఏడో నెంబరు 'బి' కాని 'సి' కాని, వస్తే దాంట్లో ఎక్కటానికి ప్రయత్నం చెయ్యొచ్చని, విసుగ్గా నిరీక్షిస్తున్నా. దుకాణాల ముందు కాస్త నీడ ఉంటే, దాని ఆసరా చూసుకుని, వరసగా నిలబడ్డవారి సంఖ్య ఎంచాను. ఏవో బస్సులు అటూ ఇటూ తిరుగుతూనే ఉన్నాయి కానీ, నాకు కావలసిన బస్సు మాత్రం కంటికి కనిపించటంలా. రిస్టువాచిలో పెద్దముల్లు రెండంకెల్ని దాటేసింది. రూల్సు తిరగేస్తే, యీ వ్యవధిలో రెండు బస్సులు రావాలసిందేట !

'నే చెప్పటంలేదురా, మన యెక్కాలసిన బస్సు ఈ జన్మలో రాదు ... ''' నిస్పృహగా అన్నాడు ఓ యువకుడు.

'ఏం అంత ఖచ్చితంగా చెప్పేస్తున్నావ్ ! ....' ప్రక్క స్నేహితుడు అడిగాడు.

'మన జాతకం అలాంటిదిరా ! మనం వచ్చి నిలబడితే చాలు, ఎక్కడ బస్సులు అక్కడ ఆగి ఊరుకుంటాయి. లేకపోతే మనం వచ్చి ఏ వేళయింది, ఇంతవరకు నారాయణగూడా వెళ్లే బస్సు రాకపోవట మేమిటి నా మొహం ! ....'

'సరేలే, అదా నీ ఎనాలిసిస్ ! ఈ బస్సులు ఎప్పుడూ ఇంతేలే ! .... అదుగో సెవెన్ బి వచ్చింది .... అన్నాడు యింత మొహం చేసుకుని.

'ఏడు బి' నెంబరు బస్సు రాణిగంజ్ (సికిందరాబాదు) నుంచి కోటీ వచ్చి అక్కడ జనాన్నంతా కుమ్మరించేసి, గిర్రున ఓ రౌండు కొట్టేసి, బస్సుస్టాండు దగ్గర పెద్ద టాంకులాగ ధ్వని చేసుకుంటూ ఆగిపోతుంది.

బతికిపోయినాం, ఈ బస్సులో కొంపకి చేరుకోవచ్చులే అంటూ నిట్టూర్చాడు. నాకూ కొంచెం ధైర్యం వచ్చినమాట నిజమే ! ఇక్కడినుంచి బయలుదేరే బస్సు కాబట్టే జనం అంత ఘోరంగా బస్సుస్టాండు దగ్గర మూగలేదు. కాబట్టి, ఫరవాలేదు కూర్చోటానికి సీటు దొరక్కపోయినా నిలబడటానికైనా అవకాశం ఉంటుందనుకున్నా. ఇక ముందుకు సాగే ప్రయత్నంలో ఉన్నా.

వచ్చిపడింది అమాంతం బస్సు; ఇట్టే గిర్రున తిరిగి. అదింకా ఆగనూ లేదు; ఇంకా రొప్పుతూనే ఉంది. ఎక్కడినుంచి వచ్చారో, వచ్చారు మరి, మూడు బస్సుల జనం. గభాలున ఒకర్నొకరు తోసుకుని, ఆ చిన్న ఎంట్రెన్స్‌లోంచి, పదిమంది ఒక్కసారి లోపలికి వెళదామనే ఊపుతో, హోరాహోరి యుద్ధం చేస్తున్నారు. ఒక్కడూ ముందుకు సాగలేక పోతున్నాడు. ఒక్క త్రుటిలో ఓ యువకుడు అతి సాహసంమీద బస్సులోకి వెళ్లి పడ్డాడు. కండక్టరు మాత్రం తనకేమి సంబంధం లేనట్టు కాగితంమీద లెక్కలు సరిపుచ్చుకుంటూ ఈ అపూర్వమైన 'క్రమశిక్షణకు' నవ్వులు కురిపిస్తున్నాడు మధ్య మధ్య. 'టెంషన్' కొంచెం వదులవంగానే, గబగబ జనం ముందుకు చొచ్చుకుపోయారు.

తిండి ఉంటే కండ కలదోయ్ .... అని గురజాడ వారు చెప్పింది స్ఫురణకు వచ్చింది. అయితే ఎంత కండున్నా, సీట్సు లిమిటెడ్‌గా ! వెనక్కు జారిపోయారు మిగిలిపోయిన జనం. ఈ బస్సు బుర్రుమనంగానే ఏడో నెంబరు 'సి' ధూకుడుగా పరుగెత్తుకుంటూ వస్తోంది. ఈ బస్సు వృత్తాంతం ఏమిటంటే, సికింద్రాబాదు స్టేషన్లో బయలుదేరి, దారి పొడుగునా, తిట్లు తిట్టించుకుంటూ, కారణం ఆగినచోటల్లా 'జాగా నై' అంటమేగా ? మెలికలు తిరుగుతూ, కోటీ మీదుగా అఫ్జల్‌గంజ్ వెళ్లి రెస్టు తీసుకుంటుంది. మళ్లీ అక్కడినుంచి బరువుగా తిరిగి వచ్చేస్తుంది, సికింద్రాబాదు స్టేషనుకు. ఈమధ్యలో ముఖ్యమైన 'సంధి' కోటీ.

ఇక్కడ జనమంతా, అంటే ఏడు 'బి' బస్సుస్టాండు దగ్గర ఉన్న ప్రయాణికులు అమాంతం వస్తున్న బస్సు వైపుకు పరుగెత్తారు. అక్కడవుతే బస్సులోంచి దిగే జనం కూడా ఉంటారు. దిగేవాళ్లు, ఎక్కేవాళ్లు, 'మంచి మాటలతో' పరామర్శ చేసుకుని, ఒకర్నొకరు క్రోధంగా చూసుకున్నారు. అయితే ఆఖరి 'శాల్తి' దిగటంలో ఉంటుంది ఉన్న తమాషా అంతా. ఓ కాలు క్రింది మెట్టుమీదపెట్టి దిగబోతున్న ఆ వ్యక్తి అవస్థ చూస్తుంటే, గుండెలు తరుక్కుపోతాయి. సజీవంగా ఆయన్ను చూడకలుగుతామా అనిపిస్తుంది! ఒక్క నెట్టుముందుకు నెట్టే, మళ్లీ యిట్టే వెనక్కు తోశేశారు. ఈ రాపిడికి నలిబిలయి, ఉక్కిరి బిక్కిరయిపోయారు. ఆయన అంటున్న కఠోరమైన వాక్యాలుకూడా వినిపించుకోకండా, యెవ్వరి పని, వాళ్లుచేసుకుపోయారు. చిట్టచివరకు ఎట్లాగయితేనేం, దిగి బైటపడి, చొక్కాకాలరు, పైకి గుంజి పొంటుమీద నల్లటి తొడుగును దులిపేసి, నిట్టూర్పు విడుస్తూ, బస్సుస్టాండులోపల నిలబడ్డారు ఆయాసపడుతూ అలసట తీర్చుకుని, యిక బయల్దేరాడు తన స్వస్థలానికి కాళ్లీడ్చుకుంటూ. నిలబడ్డ తోటి ప్రయాణికులు అతనివంక వింతగా చూస్తూ పాపం అనుకొన్నారు.

కాని అంతెండలో కదలక మెదలక, అప్పుడప్పుడు పుస్తకాల బొత్తిని ఎండకు రక్షణగా, మొహాలకు అడ్డంపెట్టుకుంటూ, బస్సులకోసం నిరీక్షిస్తున్న లేడీ స్టూడెంట్సు విషయంగాని, ఊళ్లో కబుర్లన్నీ, పెద్దగా చెప్పుకుంటూ, బస్సులవాళ్లని దుమ్మెత్తిపోస్తున్న, యితర ఆడవాళ్లవిషయంగాని, ఎవరూ ఆలోచించినట్టు కనబడదు.

ఇలాంటి చరిత్రను సృష్టిస్తూ, యింకా రెండు బస్సులు కూడా దాటిపోయినాయి. జనమవుతే పల్చబడ్డట్టే కనిపించారు. ఈ సారివచ్చే బస్సులో, మనకు సీటు రిజర్వయిందనుకున్నా, నా ప్రక్కనే యిద్దరు వ్యక్తులు వచ్చి నిలబడ్డారు.

"ఏమవుతుందంటావ్ !...." విచారంగా అడిగాడు.

"ఏమిటి !...." పరధ్యానంగా ప్రశ్నించాడు రెండో అతను.

'అదేనోయ్ ! చైనావాళ్ల సంగతి !.... రోజురోజుకు వచ్చిపడుతుండె, ఒక్కొక్కటే మనం ఖాళీ చేస్తుంటే ! ...'

'మనం రెడీగా లేనప్పుడు, వెనకపోటు పొడిచారు! ఏం చేస్తాం....తప్పదు మరి! .... ఇప్పుడు కళ్లు తెరచాంగా, వాళ్ల చావుకొచ్చిందన్నమాటే !.... ఇది కేవలం యుద్ధమన్నమాటే; వేరేప్రకటించాలేమిటి! మరి యుద్ధంలో అటూ ఇటూ నష్టాలు వుండనే వుంటాయి ఈ కాస్తవాటికే మనం ఇదయిపోతే యెట్లా? ముందుముందు, వాళ్లను తరిమి కొట్టాలంటే, యెంతో సాహసంతోను, ఆత్మవిశ్వాసంతోనూ ఉండాలి. ఈ చిన్నవాటికి గాభరా పడకూడదు. నాలుగైదుచోట్ల, వెనక్కు వెళ్లడం వలన, యుద్ధంలో మన అంతిమ విజయానికేమీ లోటుండదు. ఇప్పుడు మనవాళ్లు వెనక్కుతగ్గుతున్నదానికి, ఏడింతలుగా, చైనా విద్రోహులు, దిక్కులేకండా పారిపోవాలసివస్తుంది....పెరుగుట విరుగుటకొరకే అని ఊరికే అన్నారా మరి!....' ఇంకా తనకు తెలిసిన విషయాలను చెప్పబోతుండగా, అతని స్నేహితుడు, అమాంతం ఆపేసి, అదుగో చైనావాడు, ఎంతధైర్యంగా తిరుగుతున్నాడో చూడు అన్నాడు.

మేమంతా యిట్టే, ఆయన చూపుడువేలును బట్టి కళ్లు తిప్పాము.

అవును; చైనావాడేమో అనిపించింది. ఆయనిట్టే చూసి, కళ్లు నిలిపేశాడు. పక్కున నవ్వాడు.

'వాడు చైనావాడు కాదోయ్! శంకరయ్య మేనల్లుడు. వాణ్ణి, మొట్టమొదట చూసినప్పుడు నేనూ అట్లాగే అనుకున్నా...' అన్నాడు.

మా అందరికీకూడా ఆశ్చర్యంతోపాటు నవ్వూ అనుకోకుండా వచ్చేసింది.

'అయినా, ఈ ఊళ్లో చైనావాడేం చేస్తాడులే ! అసలు ప్రమాదమైన 'చైనావాళ్లు' మనలోనే వున్నారు. వాళ్లనో కంట కనిపెట్టివుండాలి. హిస్టరీ తిరగేసిసి చూస్తే, మన దేశం, విచ్ఛిన్నం కావటానికి, మొదటినుంచీకూడా, పరాయివాళ్ల దండ

47వ పేజీ చూడండి

## జరిగిన కథ

నిచుళానగరంలో శృంగారమంజరి రెంపిన కుమార్తె హేమసుందరిని అర్ధరాత్రి కలుసుకోనవచ్చి రంగనాయకుడు, కావలివారిని గాయపరిచిపోతాడు. మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల రహస్యం హేమసుందరిని వలచిన తన ప్రియుడు తిరుమలరెడ్డికి చెబుతుంది. తిరుమలరెడ్డి ద్రోహం తెలుసుకున్న మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకులు కలుసుకునే ఏర్పాటు చేస్తుంది. రంగనాయకుడూ హేమసుందరి శ్రీరంగం పారిపోతారు. తనని గాయపరచవచ్చిన సింహాచలాన్ని చంపివేస్తాడు. విశాలనేత్రాల మొక్కు చెల్లించి వస్తుండగా హేమసుందరీ రంగనాయకులకు రామానుజ యతీంద్రుల దర్శనం కలిగి గాఢాభిమానంగా మారి అంతేవాసులకు అసూయ రేకెత్తిస్తుంది. యతీంద్రుని దయవల్ల రంగనాయకునికి విశాలనేత్రి దర్శనం కలుగుతుంది. రంగనాయకునిలో మార్పు గమనించిన హేమసుందరి రామానుజులను సందర్శిస్తుంది. రామానుజుల పూర్వవృత్తాంతం తెలిసిన అంతేవాసులకు హేమసుందరీ రంగనాయకుల సాన్నిహిత్యంతో ఆందోళనకలిగి కొంతమంది మఠంవిడిచిపోతారు. మఠాధిపతి యజ్ఞమూర్తి రంగనాయకుని నొప్పిస్తాడు.

# 27

ఆ పైన హేమసుందరి కాని, రంగనాయకుడు కాని ఎన్నడు మఠంలో అడుగుపెట్టలేదు! అలాగ వారం పదిరోజులు గడిచిపోయాయి! కొంచెం సిరి సంపదలున్నవారి కెవ్వరికి ఆ వార్త అంత త్వరగా తెలియలేదు. అందువల్ల మఠంమీద వారి వైఖరిలో మార్పేమి గోచరించలేదు! అయినా యజ్ఞమూర్తి పరిస్థితులన్ని క్రమ క్రమంగా తప్పక చక్కబడగలవని బాగా సంతృప్తిపడ్డాడు. ఇటీవల రంగనాయకుడర్పించిన కానుకలతో ప్రస్తుతానికి మఠానికికేలోటు రానీయకుండా కాలక్షేపం చెయ్యవచ్చునని అతనికెంతో ధైర్యం కలిగింది. అయితే ఆచార్యుని ధోరణిలో మాత్రం యజ్ఞమూర్తి కొక వింత గోచరించింది. ఒకటి రెండు మారులాయన హేమసుందరీ రంగనాయకుల విషయం ప్రశ్నించాడు. యజ్ఞమూర్తి వారిటీవల మఠం వైపే రావడం మానుకొన్నారని రవంత ముభావంతో సమాధానం చెప్పి తప్పించుకొన్నాడు.

అది జరిగిన మరునాటి తెల్లవారుజామున మఠంలో ఒక పెద్ద కలకలం చెల్లరేగింది! ప్రభాతవేళ గభీర మధుర స్వరంతో మఠదైవతం దేవరాజస్వామి స్తోత్ర శ్లోక పారాయణం రామానుజయతి కొక్క

49—పేజీ చూడండి



# విచిత్ర వివాహాలు

శ్రీ 'యు'

(గత సంచిక తరువాయి)

ఇలా లోకాన్ని మోసం చేయటం అదే మొదలు కాదు. రాజు అదివరకు ఎందర్నో మోసంచేశాడట. ఆ సంగతి తర్వాత ఎలా తెలుసుసున్నానో ఇంకోచోట చెప్తా. రాజు బర్మాలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ అనే విషయం మనం తెలుసుకున్నాం కదా! ఈ 'బిరుదును' అడ్డుగా పెట్టుకుని రాజు ఎంత నాటకం ఆడాడో—అదే ఇప్పుడు చెప్పబోతున్నా.

రాజు కలకత్తాలో బర్మా—ప్రభుత్వం నియమించిన ఇంటర్వ్యూ సంఘంముందు పై ఉద్యోగానికి ఇంటర్వ్యూకు హాజరయ్యాడు.

ఆ సంఘం అతన్ని ఎన్నికచేసి, కొంతకాలం ఆగితే ఉద్యోగం కల్పిస్తామని చెప్పింది. అవసరమున్నప్పుడు తెలుసుకునేందుకు వీలుగా రాజుతో ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపుతూండవలసిందని బర్మా ప్రభుత్వం తన కాన్సలేట్‌ను ఆజ్ఞాపించింది. కొంతకాలం తర్వాత బర్మా ప్రభుత్వం, రాజును భార్యా బిడ్డలతో బయల్దేరి రావలసిందని, ఆ కుటుంబాని కంతటికీ మొదట తరగతి ప్రయాణానికయ్యే ఖర్చు భరిస్తామని తెలిపింది.

మా అక్కగారు లండన్‌లో ఉన్నారు. వారి అనుమతి రాగానే వివాహం జరిపించవచ్చు; ఓ ఆర్నెల్లు ఓపిక పట్టండి" అంటూ వాయిదా వేస్తుండేవాడు. ఈ తతంగం కొన్నాళ్ళపాటు జరిగింది. బర్మా కాన్సలేట్ వాళ్ళ దగ్గర్నించి తరచు ఉత్తరాలు వస్తుండేవి. అందులో ఎంతసేపున్నా "మీరు అడిగిన విషయాన్ని గురించి ఆలోచిస్తున్నాం" "మీరు చెప్పింది పరిశీలనలో ఉంది." ఇలాంటి మాటలుతప్ప వేరే ఒక్క ముక్క ఉండేదికాదు. బర్మా ప్రభుత్వపు ముద్రలతో వస్తున్నందువల్ల శాస్త్రిగారు కూడా ఏమీ అనలేక పోయేవారు. కానీ, మనస్సులోమాత్రం "అల్లుడు ప్రాణానికి దయ్యమై పట్టాడే" అని బాధ పడక తప్పటంలేదు—దిన దినానికి తిరిగిపోతున్న బ్యాంక్‌లోని డబ్బు చూచుకున్నప్పుడు. రాజు శాస్త్రిగారి ధనాన్ని విలాసాలకు ఖర్చుపెడుతుండేవాడు.

శాస్త్రిగారి కుమారరత్నం చాలా ప్రయోజకుడయ్యాడు. జమిందారుగారి అక్రమ రవాణా వ్యాపారంలో ఏకులా జొరబడి మేకై కూర్చున్నాడు. జమీందారువారి ఆర్జనం సుబ్బు ఖర్చులు కూడా కున్నాడు. నెమ్మదిగా కామజ్యోతి ఇంటికే బయల్దేరాడు. అయినా అక్కడ ఆ ఇంట్లో ప్రవేశమే దొరకలేదు. రాత్రింబగళ్ళు ఆ ఇంటి దగ్గరలో తిరుగుతూ, కాపలా కాయసాగాడు. ఒక రోజున ఒక విచిత్రం జరిగింది.

ఆరోజు రాత్రి సుబ్బు, కామజ్యోతి ఇంటివేపు వెళ్తుండగా వీధి మొగలో జమీందారుగారి కారు కన్పించింది. జమీందారువారికీ వీధిలో ఏం పనా అని కాసేపు ఆశ్చర్యపడ్డాడు. ఈలోగా కారు వచ్చి కామజ్యోతి ఇంటిముందు ఆగటం; రాజు, డ్రైవరు, అటూ ఇటూ దొంగచూపులు చూస్తూ కామజ్యోతి ఇంట్లో ప్రవేశించటం చూశాడు. తన బావగారికి కామజ్యోతి ఇంట్లో ఏం పనో అర్థంకాలా! సరే ఎందుకైనా మంచిదని ఎవరూ చూడకుండా వచ్చి కార్లో కూచున్నాడు. కొన్ని నిముషాలు గడిచాయి. జమీందారుగారి కారు—డ్రైవరు ఇంట్లోనుండి వచ్చి కార్లో కూచోబోతూ లోపల ఉన్న సుబ్బును చూచాడు. ఉలిక్కిపడ్డాడు. పాపం అతని పరిస్థితి మరీ ఇరకాటాన పడింది. ఇంతలో సుబ్బు అతనికి ఆలోచించే వ్యవధి కూడా ఇవ్వలేదు.

## యథార్థమైన అపరాధ పరిశోధన గాథ

ఈ పరిస్థితి రాజుని చిక్కుల్లో పెట్టింది. కుటుంబాని కంతటికీ తగిన డబ్బు వస్తుందంటే అతనెందుకు వదులుకోవాలి? అందువల్ల 'వధువు కావాలి' అని ప్రకటించాడు. గాలంలో ఇరుక్కున్న మొట్టమొదటి వ్యక్తి మన శాస్త్రిగారు.

రాజు రోజ్‌ను చూడటానికి వస్తూనే శాస్త్రిగారి ఊరు పోస్టాఫీస్ అడ్రసు ఇచ్చి వచ్చాడు. అందువల్ల ఏమైనా ఉత్తరాలుఉంటే ఆ ఊరి పోస్ట్‌మాస్టర్‌దగ్గరనే ఉండేవి. శాస్త్రిగారింటినుంచి సెలవు పెట్టటానికని, సెలవు పొడిగించాలని, జమిందారుగారి భవనానికి వెళ్తున్నాననీ, బయల్దేరి దారిలో పోస్టాఫీస్ దగ్గర తనకు వచ్చిన ఉత్తరాలు తీసుకుంటుండేవాడు. అత్యవసరంగా పనిమీద మద్రాసు పోవాలనీ, చీటికి మాటికి శాస్త్రిగారి దగ్గర్నుంచి ఆ ఊరునుంచి మద్రాసుకు, ఎక్స్‌ప్రెస్ మొదటి తరగతికి అయ్యే డబ్బు వసూలు చేసేవాడు. శాస్త్రిగారు ఈ డబ్బు తిరిగి అడుగుతారేమోనని ముందుగానే, బర్మా ప్రభుత్వం డబ్బు పంపలేదని, పంపగానే బాకీ తీర్చేస్తాననీ పాచిక వేసేవాడు. శాస్త్రిగారిచ్చిన డబ్బుతో దగ్గర గ్రామాలకు వెళ్ళి, తన 'వధువు కావలెను' ప్రకటనకు జవాబిచ్చిన ఆడపిల్లల్ని చూసి వస్తూఉండేవాడు. ఏ సంబంధం వాళ్ళైనా స్థిరపరుచుకుని, వివాహం చేస్తామంటే "అమ్మో! ఇప్పుడొద్దు! మా నాన్నగారు బర్మాలో ఆరోగ్యశాఖ డైరెక్టరుగా ఉన్నారు.

మించిపోయింది. ఏమన్నా అంటే, వ్యాపార రహస్యాలు రచ్చ కెక్కడమా అనే భయం. ఏమీ అనలేక ఊరుకుంటుండేవాడు. రోజ్, కామజ్యోతి, రాజు పుణ్యాన, ఎవరి దోవన వాళ్ళు హాయిగా ఉన్నారు.

ఒక చిన్నమాట! ఈ పాటికి మీకు విసుగెత్తి ఉండవచ్చు. ఏమిట్రా ఇద్దరమ్మాయిలు ఓ అబ్బాయి కథలా ఉంది; ఇందులో ఏంఉందని. నేను మొదట అలాగే అనుకున్నాను; ఇందులో ఏముందని. నేను పరిశోధన ప్రారంభించాక గాని, ఇందులో రాజు స్వరూపం ఎలాంటిదో, ఎలాంటి అన్యాయాల చరిత్రగా పేర్చుకున్నాడో తెలిసి—రాలేదు. ముందుచెప్పబోయే సంఘటన మరీ విచిత్రంగా అనిపిస్తుంది.

ఈ కొద్దికాలంలోనే శాస్త్రిగారి కుమారరత్నం— సుబ్బు చాలా పెద్దవాడయ్యాడు. డిగ్రీ ముక్కకోసం డింకీలు కొడుతున్న వ్యక్తి ఈ అక్రమ వ్యాపారంలో ఎవరన్నా పరీక్షపెడ్తే డాక్టరేట్ తెచ్చుకోగలడేమో. అతని తొమ్మిది నెలల కాలం ఈ "విద్యాభ్యాసంలో"పడి, ఇంటి ముఖమన్నా చూడలేదు! అన్ని విధాల జమీందారువారి రసికతను పుంజుకున్నాడు.

క్రమంగా అతని తృష్ణ, కామజ్యోతి పైకి తిరిగింది. డబ్బు, అంతస్థు పెరిగాయి. ఇంకేం, ఇంటికి బయల్దేరాడు. ఇంటిదగ్గర అంతా మామూలుగానే, ప్రశాంతంగానే గడిచిపోతున్నది. అయినా, కామజ్యోతి తమ ఇంటికి రావటం లేదని తెలుసు

"బాబూ! నీకు పుణ్యం ఉంటుంది. మా బావగారు రాజుని త్వరగా పిల్చుకు రా! మా చెల్లి హఠాత్తుగా చచ్చిపోయింది. అందరూ రాజుకోసం వెతుకుతున్నారు. "ఈ మాటలతో గాబరాపడిపోయాడు. డ్రైవరు వెంటనే వెనకా ముందూ ఆలోచించకుండా లోపలికి పరుగెత్తాడు.

సుబ్బుకు మంచి సమయం దొరికింది. అనుకున్నది సక్రమంగా నెరవేరిం దనుకున్నాడు. డ్రైవరు వెనకనే తను కూడా కామజ్యోతి ఇంట్లో ప్రవేశించాడు. అక్కడ వాళ్ళకు కన్పించిన దృశ్యం . . .

రాజు, కామజ్యోతి గొంతు వరకూ త్రాగి పరస్పరాలింగనంలో . . . స్పృహలేకుండా .... అబ్బ... చెప్పటానికూడా మాటలు రావు!

డ్రైవరు—గతేమో చెప్పలేం కాని, సుబ్బు మాత్రం చెప్పలేని భయంకర స్థితిలో పడిపోయాడు. తన చెల్లెలును మోసం చేశాడన్న కోపం కన్నా, తా నాశించిన పండు అనుభవిస్తున్నాడన్న ఈర్ష్య అతన్ని ముంచెత్తింది ఏంచేస్తున్నదీ తెలీక కోపంలో, పిచ్చివాడులా కేకలు పెట్టి, ఆ ఇంట్లో వాళ్ళందర్నీ హడలగొట్టి రప్పించాడు. ఒక పెద్ద రగడ ప్రారంభమైంది. చుట్టుపట్లవాళ్ళంతా చోద్యం చూస్తున్నట్టు ఆ యింటి చుట్టూ చేరారు.

(సశేషం)

# వనితాలోకం



కుమారి బి. యస్. ఇందిరాదేవి

బాంధవ్యం అనేది ఒక ఆత్మీయత. ఆత్మీయత అందరి పరమూ కాదు. హృదయాంతరాళంలో నుండి పొంగి పొరలి కొద్దిమందిమీద మాత్రమే దీని ప్రభావం పడుతుంది. ఆత్మీయతకు చిరపరిచయాలతో నిమిత్తంలేదు. ప్రేమానురాగాల అనుబంధ బాంధవ్యాలు ఒక్క చూపుతో, ఒక్క పలుకరింపుతో కలుగుతాయి. ఎన్నో జన్మల నుండి పరిచయమైనట్లు కొన్ని సంఘటనల ద్వారా బంధువులై పోతారు

ఇటీవల నేను విశాఖపట్నం వచ్చేప్పుడు రైల్లో ఇద్దరు స్త్రీలు తోడయ్యారు. బెజవాడ నుండి తాడేపల్లిగూడెం వరకు వారి ప్రయాణం. నేనొక్కర్తినే వస్తున్నందుకు వారు చూపిన ఆప్యాయత నా జన్మలో మరిచిపోలేనేమో! చక్కని ముచ్చట్లు దగ్గర నుండి చల్లని మంచినీళ్లందించేవరకు ఎంతో గారాబంగా చూశారు. వారు గూడెంలో దిగిపోయేప్పుడు గార్డును పిలిచి నన్ను చూపించి, నా విషయమైన జాగ్రత్తలన్నీ చెప్పి నన్ను సురక్షితంగా చేర్చే బాధ్యత అప్పజెప్పి మరీ వెళ్లారు. ఇప్పటికీ వాళ్ళు వ్రాసే ఉత్తరాల్లో నామీద చాలా అనురాగాన్ని కనబరుస్తారు. తలచుకుంటే ఇది ఏనాటి బాంధవ్యమో ననిపిస్తుంది

నిజంగా బాంధవ్యం ఈనాడు మనలో ఉందా! ఏమో! ఎవరికి వారే యమునాతీరే అన్నట్లుంది లోకం పోకడ. ఈనాడు ఎవరి చదువులు వారివి. ఎవరి ఉద్యోగాలు వారివి ఎవరి ఇల్లు వారిది. బంధుప్రేమ చదువుకున్నవారిలోకన్నా మోటుగా ఉండే వారిలోనే కన్పిస్తుంది. మేనరికం చూచి ముచ్చట పడేవారు మన పూర్వులు. మేనరికం పోతే బంధుత్వం తెగిపోతుందని విలవిలలాడి పోయేవారు. ఆడపడుచు తన పిల్లల్ని అన్న బిడ్డలకు గాని, తమ్ముని బిడ్డలకు గాని పెండ్లికివ్వని పరిస్థితులెదురైతే ఆమె పడే మానసిక క్షోభ అంతులేనిది. మా అత్తయ్య కూతుర్ని మా అన్నయ్య చేసుకోనేలేదని ఆమె ఇప్పటికీ సాధిస్తూనే ఉంటుంది. కాని ఆ సాధింపులో బంధుప్రేమ ఎంతగా ఇమిడి ఉందో! ఇప్పట్లో బంధువుల పిల్లను చేసుకొమ్మంటే బరువుగా మూలుగుతారు కొంతమంది. అలా చేసుకుంటే తాను కన్న కలలన్నీ కల్లలయ్యాయని, గుదిబండను కట్టబెట్టారని సాధింపులు ఎదురౌతాయి. మా బంధువు అమ్మాయి ఈ సాధింపులతోనే కృంగి కృశించిపోతూ ఉంది.

బంధు ప్రేమ, సోదర ప్రేమ చవిచూడాలంటే సొంత బంధువులే కానవసరంలేదు. సోదర ప్రేమను పొందాలంటే స్వంత అన్నయ్య కానవసరంలేదు. దూరప్రదేశాలకు విద్యావిషయంపై వెళ్ళినప్పుడు అపరిచిత వ్యక్తులైనా మన ప్రదేశంవారైతే మన విషయం చాలా జాగ్రత్త వహిస్తారు. 'అన్నయ్యా' అని గోముగా పిలిస్తే 'చెల్లాయ్' అని గారాబంగా చూస్తారు. అలాంటప్పుడు ఈ బంధుత్వం ఈనాటిది కాదు; ఏ నాటిదో అనిపిస్తూ ఉంటుంది.

వచ్చిన బంధువుల్ని ఆదరించి సత్కరించడం అరుదైనపుడు కొంత బంధాన్ని మనం తెంచుకున్నట్లే. తన పుట్టింటివారి నొకమాదిరి, అత్తింటివారి నొకమాదిరి చూచి, గృహిణి పరోక్షంగా తన భర్తకు హాని చేస్తున్నట్లే. ఆ వచ్చినవారు సరిపెట్టుకుని పోయేవారైతే తంటాలేదు. కొంచెం దుడుకువారైతే భర్తకూ, భార్యకూ మధ్య ఒక అగాధమే. బాంధవ్యానుబంధాలు చాలవరకు గృహిణిపైనే ఆధారపడిఉంటాయి.

మా ఇంట్లో నా తమ్ముణ్ణి మా నాన్నగారు కసిరినప్పుడల్లా పరుగెత్తిపోవడం, కొన్నాళ్ల వరకు రాకుంటే గాభరా చెందడం, ఆ తరువాత మా అత్తయ్యతో వాడు దొరబాబులా రావడం, మా అత్తయ్యకి, మా నాన్నగారికి జగడం జరుగుతూ ఉంటుంది. ఇలాంటి సంఘటనల్లో బంధుప్రేమ ఎంత పవిత్రమైనదో తెలుస్తూ ఉంటుంది. అందుకనే బాంధవ్యాన్ని మనం పోగొట్టుకోకూడదు. నోరు మంచిదైతేనే ఊరు మంచిది అన్నట్లు మనసు మంచిదైతే మన బాంధవ్యం కూడా విడనాడని బంధమై రాగాలు చిలికిస్తూ ఉంటుంది.

విద్యారంగంలో, ఆర్థికంగా పైకివచ్చే తమ బంధువుల్నే చూచి ఓర్వలేనివారూ ఉన్నారు. తమ బంధువులకి మంచి సంబంధాలు వస్తే చెడగొట్టేవారూ ఉన్నారు. ఒక్క ఆడవాళ్ళ విషయంలోనే కాదు. మగపిల్లల విషయంలో కూడా! మా ఊళ్లో ఒక అబ్బాయికి వేలువిడచిన మేనత్త ఒకామె ఉంది. ఆమెకు ఒక్కకూతురే కావడంవల్ల, వెనకా ముందూ ఎవరూ లేకపోవడంవల్ల (భర్తగారితోసహా) ఒక బి. యే. కిచ్చి చేశారు. ఆమెకూతురు ఎంతకాలం చదివినా ఫోర్తుఫారం దాటలేక పోయింది. ఆ అబ్బాయికి పెళ్లి సంబంధం ఆవిడ కూతుర్ని ఇచ్చిన ఊళ్లోనే స్థిరపడింది. ఉన్నఊరు అమ్మాయిదా అని, అబ్బాయిని గురించిన వివరాలను తెలుసుకుందామని ఆడంగులు బయలుదేరి వచ్చారు. 'అబ్బే అతడా! స్వయాన మా వేలువిడిచిన మేనమామ కొడుకే కదండీ! ఊచకాళ్ళూ, ఊచచేతులూనూ! నల్లటి వాడండీ' అని వ్యాఖ్యానించిందట ఆమె. ఇంకేం! ఆడవాళ్ళంతా (పెండ్లికుమార్తెతో సహా) మూతి ముడుచుకు కూర్చున్నారు. పెళ్లికూతురి తండ్రి పిల్లవానిని చూచిన వాడవటంవల్ల వారిని గద్దించి "మీరూ పోయి చూచి రండి" అని చెప్పారట. ఇంకేం వారు మా ఊరిమీద దండెత్తి మా ఇంట్లోనే విడిది చేశారు. జరిగిన విషయం చెప్పగా చూచుకొమ్మని ఆ అబ్బాయినే చూపించాము పిలిపించి. ఇంతకూ చెప్పేదేమిటంటే ఆ అబ్బాయి ఇంట్లో అందరూ పై చదువులు చదువుకున్నవారు. సభ్యత సంస్కృతిగల మర్యాదస్తులు. అందుకే పట్టరాని ఈర్ష్యతో ఈవిడగారు అలా చెప్పారని వారే తెల్సుకున్నారు. అబ్బాయి కొంచెం సన్నం. నలుపైనా అందమైన మొహం. అన్నివిధాలా మర్యాదస్తుడు. ఆ తరువాత పెండ్లి స్థిరపడిందనుకోండి.

కనుక ఓర్వలేనితనం బంధువుల్లోకూడా ఉంది. ఆ ఓర్వలేనితనం వారి సంకుచితత్వాన్నే నిరూపిస్తూ ఉంటుంది. ఇలాంటివారి విషయం మనమేమీ చెప్పలేము. కాని బంధుత్వం కుటుంబానికి వెన్నెలవంటిది. బాంధవ్యంలో అనిర్వచనీయమైన అనుభూతికూడా ఇమిడి ఉంటుంది. సహజంగా బంధుప్రేమ గొప్పగా అలవర్చుకుంటే మనలోని ఆంతర్యం అంతులేని ఆవేదనలకు గురికాదు. పండుగ వేళల్లో బంధువులతో ఇల్లు కలకలలాడుతూ ఉంటే స్వర్గధామాన్ని చూస్తూ ఉన్నట్లు ఉంటుంది. బాంధవ్యం అనేది విడరాని బంధంగా చూసుకోవలసిన బాధ్యత మనమీదే ఆధారపడిఉంటుంది. ★




## చదువుకున్నవారికేనా గర్వం?

సమాజంలో చదువుకున్నవారికి (ముఖ్యంగా ఆడవాళ్ళ) గర్వముంటుందనే అపోహ తొలగించటానికి యిటువంటి వ్యాసాలు దోహదమిస్తాయనటంలో సందేహములేదు. యివేగాక నేటి సాంఘిక పరిస్థితుల దృష్ట్యా స్త్రీ జనాభ్యుదయానికి అవసరమైన విజ్ఞానాన్ని ప్రసాదించే ఉత్తమ వ్యాసాలను ప్రచురిస్తే "వనితాలోకం" శీర్షిక సచిత్రవారపత్రికలో మణిపూసలాగ వెలుగొందుతుందని నా నమ్మకము.

—పురాణం ధనలక్ష్మమ్మ (ధర్మవరము)

* * *

ఈ వ్యాసం చదువుతుంటే ఎంతకు తన్నుతాను పొగుడుకొని, తాను "బీ. ఏ హై సెకండు" క్లాసులో పాసయినట్లు, తాను లాయరుగారి అమ్మాయి అని, తన కుటుంబములో 'ఇంటర్' చదివిన అమ్మాయి ఉన్నట్లు పాఠకులంతా తన పేరుమీద విమర్శ జరుపుకోవాలని వ్రాసినట్లు తోచుచున్నది. ఇకముందు ఈ లాంటివే వ్రాస్తూయుంటే "కుమారి అయ్యగారి సూర్యకాంతం"గారి మాదిరే పాఠకులంతా వ్రాయాలిసి వస్తుంది. ఎట్లయిన లక్ష్మిగారి కోరిక ఫలించి పేరు వనితా లోకంలో ఎక్కిందిగా! రేపు వచ్చే పత్రికలో పేరుపెట్టి విమర్శించుకుంటారు.

జి. సుశీల (ఖమ్మంమెట్టు)

* * *

గర్వం ప్రత్యేకంగా చదువుకున్నవారికే ఉంటుందనటం అవివేకం. వ్యక్తుల మనస్తత్వాలననుసరించి ఉంటుంది. నిజం చెప్పాలంటే చదువురానివారికున్న గర్వంతో పోలిస్తే చదువుకున్నవారి గర్వం గర్వించదగినదే!

—దేవీ ప్రభాకరరెడ్డి (హైదరాబాదు)

* * *

యస్. లక్ష్మిగారు చదువుకున్నవారికే గర్వం ఉంటుందనుకోవలసిన పనిలేదన్నారు. అది నిజమే కావచ్చు. కాని వారి విషయంలోమాత్రం గర్వం ఉన్నట్టుగానే అనిపిస్తుంది. ఇందుకు నిదర్శనం వారి వ్యాసంలోని ఈ క్రిందివాక్యాలు:

(1) "హై సెకండుక్లాసులో ప్యాసయ్యాను"

(2) "కాని యూనివర్సిటీకి కారణాంతరాలవల్ల పోలేదు."—

(1) యూనివర్సిటీవారు ఫస్టు, సెకండు, థర్డు క్లాసులు ఇస్తారు గాని— "హై సెకండుక్లాసు ఇస్తారా?"

(2) వారు యూనివర్సిటీకి పోలేకపోవటం పాఠకులకు అనవసరమేమో!

ఇవి లేకుంటే మిగతా వ్యాసం బాగానే ఉండేది.

అన్‌రూప్ (హైదరాబాదు)

* * *

"గర్వం" అంటే అసలు ఏమిటో అర్థం తెలియని వారుకూడా 'గర్వం' అనే పదాన్ని ఉపయోగించి ఇతరుల (చదువుకున్న ఆడపిల్లల) మీద మాట్లాడుతూ ఉంటారు. ఈ ఆడపిల్లలు ఎంతేని చదువుకోనీ; కాని మాట్లాడేవారికంటే కొంచెము ఎక్కువగా ఉంటే చాలు; వారు అలా మాట్లాడుతారు.

టి. ఆర్. లక్ష్మి (భువనగిరి)

* * *

నేనేకదా? చదువుకున్నానని ఏమి గర్వమమ్మా అనేమాట వాడుకపదమయింది కానీ, గర్వానికి కారణము చదువుకోవడమూ, చదువులేకపోవడమూ కాదు. లక్ష్మిగారు వ్రాసినట్లు అది వారివారి మనస్తత్వాలని బట్టిఉంటుంది.

యం. రంగనాయకి (పర్లాకిమిడి)

* * *

ఈ వ్యాసాన్ని రాయడంలో గల అంతిమోద్దేశం అర్థంకావడంలేదు. బహుశా చదువుకున్నవారికి గర్వం ఉండదని వారి ఉద్దేశ్యమేమో! ఈ రోజుల్లో నూటికి 70 మంది చదువుకున్న స్త్రీలు అమిత గర్వంతో చదువురాని స్త్రీలయెడ ప్రవర్తిస్తుండడం చూస్తూనే ఉన్నాం మనం. కాలేజీ చదువు చదివే అమ్మాయిలు పల్లెటూరి అమ్మాయిల పట్ల ఎంత గర్వంతో వ్యవహరిస్తారో అందరికీ తెలుసు. కాని చదువురానివారికి ఎలాగయినా 'ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్సు' అనేది ఉంటుంది కావున వారు గర్వంతో ప్రవర్తించడానికి అస్కారమే లేదు. ఈ రోజుల్లో పట్టణాలలో చదువుకున్న స్త్రీలు, తమంతవారు లేరని గర్వంతో విర్రవీగిపోతూ సాటి అవిద్యావంతులయిన స్త్రీలను నీచంగా చూడటం, లక్ష్మిగారికి తెలీదనుకుంటాను. ఉత్తమమయిన సంస్కారంగలవారికి గర్వం ఉండదని లక్ష్మిగారు రాసినదానితో నేను ఏకీభవిస్తున్నాను.

ఇ. ఉషాహేమచందర్ (హైదరాబాదు)

## భార్యలు బానిసలా?

ప్రపంచంలో స్త్రీ పురుషులమధ్య ఉండవలసిన సామరస్యమునూ, ఆఫీసునుండి యిల్లుచేరుకోగానే యింటిలోని పని బాధ్యతనంతా (వంట వగైరాలు) వహించాలంటే స్త్రీలు పడే చికాకు, అలాంటప్పుడు పురుషులు అవసరావసరాలను గుర్తించి గడుపుకోవలసిన విధానాన్ని 'రత్నామహేశ్వర్'గారు సహజంగా వ్రాశారు.

రాములు (కోతివానిపాలెం)

* * *

భార్యాభర్తలు యిరువురు ఒకర్ని ఒకరు అర్థం చేసుకొని ఎవరి పనులు వారు చక్కగా చేసుకొన్ననాడు ఆ యిల్లు స్వర్గతుల్యంగా ఉంటుందన్నమాట నిజమే. కాని యీ రోజుల్లో అంత స్వార్థత్యాగులు చాలా తక్కువ. ఈ వ్యాసం చదివిన తరువాత నాకు ఒక చిన్నవిషయం జ్ఞాపకం వస్తున్నది. మా యింటి పక్కనే ఒక దంపతులుండేవారు. పాపం ఆవిడ చాలా సహనంతో అన్ని పనులు భర్తకు అనుకూలంగా చేస్తూఉన్నా, అతడుమాత్రం ప్రతిచిన్న విషయానికి తుస్సుబుస్సుమంటూనే ఉండేవాడు. యింకా ఆవిడ—రోజులు బాగులేనినాడు అతడు చెయ్యివేసుకునేవాడు. యిటువంటి మూర్ఖులు యీనాడు కూడ లేకపోలేదు. పురుషులతో సమాన హక్కుల కోసం పాటుపడుతున్న ఈ నవ భారతావనిలో స్త్రీలు ఏనాటికీ బానిసలుకారు. అయితే పురుషులలోకూడా నైతిక జ్ఞానం పెంపొందాలి. స్త్రీలను అర్థం చేసుకోవాలి.

శ్రీరంగం లక్ష్మీకామాక్షి (కొంగసారా)

* * *

వ్యాసం చాలా బాగుంది. ప్రస్తుత ప్రపంచంలో భార్య అంటే ఆనందం కల్గించే యంత్రంగాను, ఇంటి చాకిరి చేసే బానిసగాను చూసే భర్తలకు భార్య కూడా మనలాంటి మనిషే; ఆమెకుకూడా విశ్రాంతి స్వతంత్రం అవసరం. భార్యకు ఇంటి పనులలో సహాయంచెయ్యడం అంత చెడ్డపనికాదు అని తోచాలి.

శ్రీమతి పి. భానుమతిదేవి (రాజాం)

## విమర్శ

అసలు వనితాలోకం అంటే ఏమిటో కుమారి అయ్యగారి సూర్యకాంతంగారికి బోధపడలేదు ఏమోనని అనుకుంటాను. లేకపోతే వారు "భార్యలు బానిసలా" అనే వ్యాసంపై అలా విమర్శచెయ్యరు అని నా ఉద్దేశం. వనితలు వారియొక్క అనుభవాలు, అనుభూతులు, కష్టసుఖాలతో నిండిన వ్యాసభాగము లనే వనితాలోకంలో వేస్తే బావుంటుంది. అప్పుడే "వనితాలోకం" అనే పేరు వనితాలోకానికి సరిపోతుంది. అంతేకాని ఏదో పరిశుభ్రతను గురించిన వ్యాసాలు వనితాలోకం శీర్షికకే చెందవు.

పెరుమాళ్ళ సౌభాగ్యం (భీమవరం)

## శ్రీవారితో చెప్పకూడనిదేమిటి?

కన్నెకంటి పార్వతీదేవిగారు భార్య, భర్తవద్ద యే విధముగా మెలగవలెనో మాత్రమే తెలిపిరి. కొన్ని సంసారాలలో భార్య యెంత అనుకూలవర్తి అయినను, భర్త అనుకూలుడు కాకపోయినచో అతని వలన అనేక బాధలుపడుచు చివరకు తనకున్న ఓర్పును కూడ కోల్పోవును. అట్టి సంసారము నరకముగ ఉండును. సంసారములో ఒక్కొక్కరికి మాత్రము

ఓర్పు ఉండిక గాలడు. దంపతులు ఓర్పు కలిగి ఒకరి మనస్సు ఒకలు అర్థంచుకొని సంతోషముగ కాలము గడిపిన ఆ సంసారము స్వర్గముగ ఉండునని నా అభిప్రాయము.

అర గాశేఖర్ (సికందరాబాద్)

* * *

కన్నెకంటి పార్వతీదేవి వ్రాసిన 'శ్రీవారితో చెప్పకూడ దేమిటి?' వ్యాసం నన్నెంతో ఆకర్షించింది.

పి రమా సత్యనారాయణరెడ్డి (తిమ్మాపురం)

* * *

ఈ రోజుల్లో ఆవిడ రాసినట్లు నడుచుకునే ఆడవాళ్ళు ఎంతమంది ఉంటారనేది విచారించ తగిన విషయం. పై అధికారిచేత చివాట్లుతిని, ఇంటికి చేరగానే శ్రీమతిగారిచేత కూడ చివాట్లు తినకుండా చెయ్యమని భగవంతుని ప్రార్థించే భర్తలు లెక్కకు మిక్కిలి. లేకపోతే, ఇంటికి చేరే టప్పటికి, 'శ్రీమతి ఏ క్లబ్బుకో, విహారానికో వెళ్లి వుంటే బాగుండును' అనుకున్న మగవాళ్ళుకూడా లేకపోలేదు.

శ్రీమతి ఎం టి రాజు (ఘోర్‌బాగ్)

★

---

## కుమారి కళ - 13    బొమ్మలకథ    దేవిక

సురేష్ కళను చాలా స్నేహంగా చూస్తున్నాడు. స్నేహం అంటే కేవలం స్నేహమే గాదు........

అతని అభిమానం ప్రేమగా మారింది యిక శివరాంరాడు తనను కళ పెళ్ళి చేసుకోరాందా అనుకుంటున్నాడు

ఇక చెప్పతేరాలి అని ధైర్యం చేసి యిలా చెప్పాడు సురేష్.



# సరాగమాల

**వి ఎ కె రంగారావు**

'సువ్వా—నేనా' జి. ఇ. 35312

తోటకంతా పరిమళం తెచ్చిన పువ్వులాగ 'మసక మసకచీకటిలో' చిత్రానికంతకు సొంపుగూర్చిన పాట. ఆరుద్ర వ్రాసిన మాటలలో మహదేవన్ అమర్చిన వరుసలో, వాద్యానుసరణలో, సుశీల కంఠంలో అన్నిటిలో అడుగడుగునా ధ్వనిస్తున్న ప్రత్యేకత "మసక మసక చీకటిలో మల్లెపూల వాసనల"వలె మనసును చుట్టివేస్తున్నది. ఎప్పుడో కాని, ఒక పాటకు ఉండవలసిన హంగులన్నీ ఇంత సమగ్రంగా సమకూడవు. ఇది ఒక పాటకాదు శబ్ద, స్వర, స్వన, వాద్య, లయ, తాళ, నాదములైన సప్తాంగములు సప్త వర్ణములై, సప్తవాహినులై, సప్తస్వరములై దివినుండి భువి కొరిగిన ఒక ఇంద్రధనుస్సు. రంగుల జలపాతం, సంగీత ఝరి. ఈపాటను ఒంటరిగావినండి. జంటగా వింటే ఏకాగ్రత కొరవడవచ్చు. కొరవడితే ఆ ఆనందాన్నంతా ఆస్వాదించలేకపోవచ్చు. ఆ కొంచెం లోపం మాత్రం ఎందుకు కలగాలి?

పై పాట ఎంత సున్నితంగా ఉందో, రెండవ ప్రక్కనున్న "కొరడా పట్టిన మా రాజా" అంత మొరటుగా ఉంది. కాని, తమాషా ఏమిటంటే ఈ మొరటుతనంలోను అందంఉంది. దానికీ, దీనికీ ఒకే తేడా! అది వీణ మీటయితే ఇది ఘంటారావం. ఇటువంటి వరసలను తమిళదేశంలో "డప్పాంకుత్తు" పాటలని అంటారు. అంటే పామరజనులు ఉల్లాసంగా డప్పు వాయించుకుంటూ, తుళ్ళుతూ, తూలుతూ, ఆడుతూ పాడే పాట. ఇటువంటిపాటలకు తమిళదేశంలో ప్రాచుర్యం ఎక్కువ. ఆ దేశానికి స్వంతమనిపించుకొనదగ్గ వరసయినా అరవ వాసన రాకపోవటానికి ముఖ్యకారణం ఆరుద్ర రచన. ప్రతి చరణంలోను తెలుగుతనం కొట్టొచ్చేటట్లు మన నుడికారం కనబడుతున్నది. ఈ కారం ఇంత ఘాటుగా ఉండటానికి కారణం, పాటలో తమిళతనం ఎక్కడా కనపడకూడదని ఆరుద్ర పడిన జాగ్రత్తే అయి ఉంటుంది. ఘాటుగాఉందన్నానని వినటానికి హాయిగా లేదనుకోవద్దు. మీ కా భయమెందుకు? ఎంత కర్కశపు సంగతినైనా, సాహిత్యాన్నైనా కండ చక్కెరలా చేయగల శ్రీనివాస్ కంఠం ఉందిగా? ఆ కంఠంలో ధ్వనిస్తున్న చిన్నతనపు అల్లరంతా వినేవారికి తెలిసీ తెలియనట్లు గిలిగింతలు పెడుతున్నది. మొదట చెప్పుకున్నట్లు సినిమాకంతా సొగసు తెచ్చే పాటలు ఈ రెండూ!

'స్వర్ణగౌరి' జి ఇ. 35283

కొందరు పాఠకులు శ్రీ బాలమురళి పాటలను పరిచయం చేయమని కోరినందున ఈ రికార్డు గురించి పాతదైనా ఇప్పుడు వ్రాస్తున్నాను. ఈపాట ముచ్చటైన మూడు రాగాల మాలిక. అభేరి, కానడ, మోహన. వరసకట్టినది ఎం. వెంకట్రాజు. అటు హిందుస్థానీ-సంగీతాన్నీ, ఇటు కర్ణాటక సంగీతాన్ని అభ్యసించి, అర్థం చేసుకొని (క్రమాలంకారము) ఒక పద్ధతి రాగానికి మరొక పద్ధతి కళలు మలిచి సరసులైన శ్రోతలచే సెబాసనిపించుకొనగల ధీరులు. పాట వ్రాసినది వీటూరి. సాధారణ పదాల కొత్త కలయికలతో కర్పూరంపు తావులు గుబాళింపజేయగల యువ కవి, నవ కవి. పాడినది శ్రీ మంగళంపల్లి. వారి విద్వత్తు గురించి, ప్రావీణ్యత గురించి వ్రాయటం చర్విత చర్వణమే అవుతుంది. కాని, ఒక్కమాట చెప్పుకోవచ్చు. వారిపాట వింటుంటే ఒక అనుమానం కలుగకమానదు. అది వెన్నెల వానా, తేనెల సోనా అని. ఆ మధురాన్వేషణలో దారి మరచుటకన్న ఆనంద మేమున్నది? రచన "జయ జయ నారాయణా" అని సాగే భక్తిగీతం

పై పాటకు పూర్తిగా విరుద్ధమైనది రెండవ ప్రక్కనున్న "రవ్వ చాలించరా" అన్నది. పాడిన జానకి కంఠంలో (ఈ పాటలో) మార్దవంలేదు. మాధుర్యముంది. సర్వజ్ఞతలేదు. సరసతఉంది. చిరకాల శాస్త్రాభ్యాసంవలన కలుగు జాణతనంలేదు. శృంగార రసోద్దీపనకు చాలిన జాణతనం ఉంది.

సినిమా చూడకముందు పాటల పుస్తకంలో ఈ పాటను చూసి ముందున్న "రవ్వ"నే మాటను బట్టి ఏ మువ్వ గోపాల పదంవలెనో వరస కూడా ఉంటుందనుకొన్నాను. అవ్వ! వినలైన పాశ్చాత్య ధోరణిలోఉంది. నే నూహించినదానికి విరుద్ధంగా ఉన్నందుకు కొంచెం నిరుత్సాహపడ్డాను కాని, రాను రాను రికార్డు వినగా వినగా ఆ తరగతి పాటలలో అది చాలా చక్కనిదే అనిపించింది. "రవ్వ" అన్నదగ్గరా "సువ్వ" అన్నదగ్గరా జానకి కంఠంలో తిరిగిన విరుపు వేయి హృదయవీణలు ఒకేసారి మోహనరాగం పలికినట్లున్నది. వీటూరి ప్రతి మాటలోను శృంగారం పొంచిఉన్నది. "రాగ నిలయము జవరాలి అధరము" "కామునిపండుగ లీలా ప్రేమలు పండేవేళా" "మరుడు కవ్వించెరా, మరులు కురిపించెరా, మోహమే మించెరా" అన్న పదాలు మచ్చు తునకలు. వల్మీకమునుండి వెల్వడిన వెలుగురేఖలు వాద్యానుసరణలో అకార్డియన్ వినిపించినదని కొందరు నేరమారోపింప వచ్చును. అంచూ, అడ్డమూ లేని జానపద ఇతివృత్తంగల సినిమాలో, పాటలో వాద్యానుసరణలో అకార్డియన్ వినిపించటమూ ఒక అందమే మరి. కావలిస్తే అందానికిముందు వింతనే విశేషణం చేర్చుకోవచ్చు. ఏమంటారు?

బాహుబలేంద్రుని—గూడెంనుంచి వ్రాసిన కృష్ణారావుగారికి: మీరు వ్రాసిన పాటకి పత్రికాముఖంగా జవాబివ్వటానికి సాధ్యపడదు. పూర్తి అడ్రసు పంపితే వేరే వ్రాస్తాను.

కలువాయి ఎస్. రాజగోపాల్, పెసరమిల్లి ఎస్. ఎస్. రావుగార్ల సందేహానికి సమాధానం: 'భార్యాభర్తలు' చిత్రంకోసం ఆరుద్ర రచన "చలి చలి ఈ రేయి" రికార్డు చేశారు. చేసిన తరువాత ఆ సన్నివేశాని కది తగదేమో అని నిర్మాతలకే తోచటం వలన దానిస్థానే మరొక పాట "రంగ రంగేళి" అన్నది. పెట్టారు. రికార్డుగా మొదటి పాటా వచ్చింది. ఇదే అప్పుడప్పుడు రేడియోలో వినవడుతున్నది.

యక్షప్రశ్న : మన తెలుగు చిత్రాలలో కొన్నిటిలో ఇతర భాషల పాటలు వినవడినవి. అవి ఏవో ఎందులోనివో, ఎవరు పాడారో (తెరమైన, వెనుక) పాఠకులు తెలుపగలరా? చిన్న చిన్న పాటలయినా వ్రాయవచ్చు. పూర్తి పాటలే ఉండాలనిలేదు.

కుమారదేవం ఉమామహేశ్వరరావుగారికి 'సిరి సంపదలు' చిత్రంలో "పువ్వు నవ్వెను" వాసంతికి పాడినది జానకి. పాటల పుస్తకంలో ఎందుకు వేయలేదో ఆ నిర్మాతలకే తెలియాలి.

బెంగుళూరు శివరాంగారికి: "అహ నా పెళ్ళంట" లో వినిపించిన మగగొంతు మాధవపెద్ది సత్యం గారిది

పెడన నుంచి వ్రాసిన డి. ఎస్. మూర్తిగారికి: "స్త్రీ" చిత్రం కోసం "కౌన్ హోతుం" రెండు విధాలుగా రికార్డు చేయబడింది కాని, సినిమాలో ఒకటే ఉన్నది. వరస ఇంచుమించు ఒకటే అయినా మాటలు భేదం. విషాదగీతం రికార్డులోనే ఉంది.

విజయపురి గుర్రాజు గారికి రేడియోలో వింటున్న ఘంటసాల పాట "ఏడుకొండలవాడా" రెండు విధాలుగా రికార్డు కాబడిందా అని ప్రశ్నించారు. లేదు. ఈ పాట మొదట రేడియో కోసం చేశారు. విపరీతంగా దీనిని శ్రోతలు అభిమానించారు. అది గమనించి హెచ్. ఎం. వి. కంపెనీ వారు వేరే పాడించి రికార్డుగా విడుదల చేశారు. ఈ రెండవసారి పాడినపుడు వాద్యానుసరణలో, పాఠంలో మీరు చెప్పిన కొలది మార్పులు చేయబడి ఉంటాయి. "జయభేరి" రికార్డులలో ఉన్న "నీదాన నన్నదిరా" అన్న పాట ఘంటసాల పాడినది. మీరన్నట్లు చాలా అందమైన పాట. నాట్యగీతాలంటే సెన్సార్ల కత్తెరలకు వింతమైన వ్యామోహం. రాజసులోచన నాట్యంచేసిన ఈ గీతం ఆ కత్తెరలకు బలియైపోయింది. ఈ విషయం తెలియగనే తెరపై ఆ పాట అంత అందంగా రూపొందటానికి కారకులైన యిద్దరు నాగేశ్వరరావులు ఎంతో విచారించారు. ఏమిటి లాభం! ఏదో విపరీతార్థం తీసి చక్కటి కళా సృష్టిని కబళించ నేర్చినవి గాని ఈ పదునుపోయిన కత్తెరలు, అతి బీభత్సంగా చూసేవారికి జుగుప్స కలిగేలా ఉన్న ముష్టియుద్ధాల జోలికి పో నేర్వ లేదు. లేడికి లేచిందే పరుగు. అశ్వానికి నిలవటమే నిద్ర.




ఆరోజుని 7 గంటలకే ప్రయివేట్ క్లాస్ తీసుకున్నారు లెక్చరర్ గారు. అటెండెన్స్ తీసుకుంటూ
ఒన్.. టూ. త్రీ...


లేట్‌గా వచ్చారు రాముగారు...!
ఫోర్...
ఫయివ్.. కమిన్...


సిక్స్...సెవెన్. కమిన్ ప్లీజ్...


ఇంతలోకే...
ఏందో ఈ సయాలరాములు ఊడ్చకుండానే తొమ్మిదిగంటలకే పోయి కూసుండ్రు ఎట్లా ఊడ్సేది


ఎయిట్.. నైన్.. కమిన్... లేట్‌గా వస్తానా
ఇక్కడ నుంచో వస్తావా ఎన్నిసార్లు చెప్పాలి



## జరిగిన కథ

రామచంద్రపురవాస్తవ్యుడు ప్రసాదరావుగారి కుమార్తె నిర్మలకు అజంతా విహారాలకు వెళ్తుండగా ట్రైనులో కాళ్ళు చెడిపోయి ప్రయాణంసాగక బాధపడుతున్న ఓ లెక్చరర్ ఆయనభార్య రుక్మిణమ్మతో పరిచయం ఏర్పడుతుంది. రుక్మిణమ్మగారు నిర్మలకు తన అక్కగారి కుమారుడు ప్రకాశ్‌తోను, వసంతకు వేల్పాలెంలోని బడిపంతులుతో వివాహం జరిపిస్తుంది. నళినీ, కుసుమలకు కూడా ప్రసాదరావుగారు వివాహాలు చేస్తారు. [illegible] భరించలేని కుసుమను భర్త అనుమతిలో ప్రసాదరావుగారు ఇంటికి తీసుకువస్తారు. ప్రకాశ్‌కు మనస్థిమితం తప్పగా బొంబాయి పిచ్చిఆస్పత్రిలో చేరుస్తారు. రాజారావుగారు తన తాతగారికి పిచ్చి ఉండేదన్న విషయాన్ని వెల్లడిస్తారు. భర్త వ్యసనాలకు లోనయ్యాడని విని కుసుమ ఆత్మహత్యకు పూనుకుంటుంది. ఈ సంగతి విన్న సుబ్బారావు అన్నను ఇంటినుంచి వెళ్ళగొట్టి, భార్యదగ్గరకు బయల్దేరాడు. డాక్టరు శాంత నిర్మలకు తనగాథ చెప్తుంది. నిర్మల చెల్లెలు వసంత చనిపోతుంది. రాధ అనే ఓ దిక్కులేని అమ్మాయి బిడ్డను నిర్మల పెంపడానికి తీసుకుంటుంది. వసంత భర్త మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడని, తమ్ముడు రామువల్ల నిర్మల తెలుసుకుంటుంది.

## 12

నిర్మల బొంబాయినుంచి తిరిగివచ్చేసరికి నెల దాటింది. బాగా చిక్కిపోయింది.

వదినను చూచి మాలతి తెల్లబోయింది. నిర్మల ఒంటరిగా ఉన్నప్పుడు వెళ్ళి అంది "వదినా! కులాసాగా ఉన్నావా? ఇలాఉన్నావేమిటి?"

"బాగానే ఉన్నాను. ఎప్పుడూ ఉండేదేగా ఈ దిగులు? ఒక్కోసారి యీ వ్యధలు నన్ను పూర్తిగా క్రుంగదీస్తాయి. అందుకేనేమో యిలా అయ్యాను"

మాలతి నమ్మలేదు. నిర్మలవైపు సంశయంతో చూచింది. ఆమె మరేమీ అడగలేదు. నిర్మల తన దైనిక జీవితంలో అడుగుపెట్టింది. మాలతికెంతో భయంగాఉంది. మునుపటి ఉత్సాహం యేమైంది? యాంత్రికంగా, పరధ్యాన్నంతో పనులు చేస్తున్న వదిన హృదయంలోని బాధను అర్థంచేసుకోవాలని ప్రయత్నిస్తోంది. కానీ నిర్మల అన్నిటికీ చిరునవ్వుతో ప్రత్యుత్తరాలిస్తుంటే మాలతికి అయోమయంగా ఉంది.

ఒకరోజు నిర్మల డాక్టర్ శాంతదగ్గరకెళ్ళి వచ్చింది. అక్కడ యేం జరిగిందో కాని నిర్మల మళ్ళీ యథాస్థితికి వచ్చింది. కొన్నాళ్ళబట్టి లేని సంతోషం, ఉత్సాహం తిరిగి ఆమెలో అంకురించినై. మాలతి యిదంతా గమనిస్తోంది

మరునటిరోజు సాయంత్రం మాలతి డాక్టర్ శాంతదగ్గర కెళ్ళేందుకు తయారైంది. కారు బయట ఆగిఉంది. మాలతి వెళ్తోందని తెలిసికొన్న నిర్మల గబగబ హాల్లోకొచ్చింది.

"ఒంట్లో నుస్తీగాఉందా మాలతి? — నేనూ రానా?" అంది నిర్మల గొంతుక్రింద చేయిబెట్టి చూస్తూ ఆత్రంగా.

మాలతి వదినప్రేమకు ఉక్కిరిబిక్కిరైంది. మెల్లగా అంది "నాకేం, బాగానే ఉన్నాను. నిన్ను

38 వ పేజీ చూడండి

# అందమైనదీ.... పురాతనమైనదీ....

# 'బార్డో' నగరం!

"బొర్డోహ్" రేవు పట్టణం ఫ్రాన్సులో ఉంది. సముద్రానికి ఇది 60 మైళ్ళ దూరంలో ఉంది గాని...చాలా కాలంనుంచి ప్రధాన ఓడరేవుగా, 'ద్రాక్ష సారాయి' వ్యాపార నిలయంగా, నిలకడగా అభివృద్ధిపొందుతూ వస్తోంది.

ఈ నగరం ఎంతో పాతదాని లాగ ఏదో వెనుకటి చరిత్ర నుంచి ఊడి పడ్డదా? అన్నట్లు ఉంటుంది. ఇక్కడి పాతదస్తావేజుల మందిరంలో ఎంతో పురాతనమైన విశేషాలు మనకు లభ్యమౌతాయి.

ఫోయ్‌నీషియన్‌ల కాలం నుంచీ కూడా ఈ నగరం వ్యాపార నిలయంగా చరిత్రకారులుపింటున్నారు. ఫోయ్‌నీషియన్‌లు ఇక్కడకు ఆ కాలంలో ముత్యాలు, ఇనుము; ఇంకా మిరియాలు మొదలైన సుగంధ ద్రవ్యాలూ తీసుకుని వస్తూఉండేవారు. అవి యిక్కడ అమ్మి, తిరిగి మంచి మాంసం, 'బంగారుపొడి' (ఖనిజం) తీసుకుని వెళ్లేవారు. స్థానిక 'పైరానీ' తెగవారు వారితో వ్యాపారం చేసేవారు.

అయితే రోమన్‌ల కాలంనించి కూడా ఈ నగరం ద్రాక్షసారాయానికి పెట్టింది పేరు. ఈనాడు కూడా ఈ రేవునుంచి ప్రధానమైన ఎగుమతి ద్రాక్షసారాయమే.



'బార్డో' నగరంలోని క్రైస్తవాలయం.

ఫ్రెంచిరేవుల్లో పెద్దవైనవాటిలో కెల్లా మూడోది ఈ 'బార్డోహ్'.

ఇది గారోన్ నది ఎడమగట్టున ఉన్నది. నగరం సముద్రముఖానికి చాలా దూరమే అయినా, సంద్రతీర వాతావరణ పొడగడుతుంది మనకి! 15 మైళ్లు ఈ నదిగా ఉండి ఈ "హార్‌బర్", "డార్డోన్" నదిలో నుంచి పోయి, 'బరోన్‌డ్' నదిగా మారుతుంది. ఐతే ఇవాళకూడా మరీ పెద్ద పెద్ద నౌకలు ఈ రేవుకు పోలేవు. లేకపోతే యిది మరీ విపరీతమైన కీర్తి ప్రతిష్ఠలను పొంది ఉండేది. 18 వ శతాబ్దపునగరమా అన్నట్లుఉంటుంది ఈ నగరం. చరిత్ర ప్రసిద్ధికెక్కిన యిక్కడి తోటలూ, ఇళ్ళూ చూడ ముచ్చటగా మనోహరంగా ఉంటాయి.

ముఖ్యంగా ఈ నగరంలోని గ్రాండ్ థియేటర్ చూడదగ్గ వింత అని చెప్పాలి. బ్రహ్మాండమైన ఈ థియేటర్ లో మూడొంతులు 'స్టేజీ' యే ఉంటుందట! దీనికి అధునాతన పరికరాలు, హంగులు చేర్చారు.

ఇందులో ముఖ్యంగా విశ్రాంతి మందిరం చూసితీరాలి. దీని మెట్లు కూడా చలువరాతితో నిర్మించారు.

ఈ నాటక నాట్యశాలలో 13000 మంది ప్రేక్షకులకు చోటుఉంటుంది. ఏడాది అంతా ఈ నాటక నాట్య మందిరంలో బాలెట్ నృత్యాలు, 'ఓపెరా'లు 'కానసర్ట్లాం'టి ప్రదర్శనలు "కచేరి"లూ, అవుతూనే ఉంటాయి. చూసి తీరాల్సినవాటిలో యిదొక మంచి నగరం.

'బార్డో' దరినే ఇటీవల 'చమురు' స్థావరాలను కూడా కనుగొన్నారు.

— టెంపిల్ మానింగ్.



# మాంత్రికుడు

ధానంచెప్పి, సరిదిద్దుకోవాలనిపించలేదు. నా మన స్పెందుకూ కొరగానిదైపోయింది. నిర్లిప్తంగా చూస్తూ ఉండిపోయా!

రోజులు గడిచిపోతున్నాయి. ఏ ఒక్కరికోసం కాలం ఆగదుకదా! విషయం నెమ్మదిగా అందరకు తెల్సిపోయింది. ధైర్యంచెప్పేవారు కొందరు, జాలి కనబర్చేవారు కొంతమంది, పరిహసించేవారు, నవ్వే వారు, సలహా చెప్పేవారు, వీరందరితోనూ విసిగి పోయాను. నా నుండి అందరూ దూరమయ్యారు. తిరిగి ఏకాకినయ్యాను.

ఈ సమయంలోనే వారం రోజులు హెచ్చు తగ్గుల్లో మా అమ్మా, నాన్నా స్వర్గస్థులయ్యారు. రాణీ! ఇటువంటి పరిస్థితులుచూసే సామెతలు పుడుతూ ఉంటాయి.

సూర్యుడు ఉదయిస్తున్నాడు. అస్తమిస్తున్నాడు. రోజు కో యుగంగా గడుస్తోంది. ఏ పనీ చెయ్యాలని పించక, చెయ్యలేక మానసికంగా మృతుడినయ్యాను. ఎప్పుడూ సుశీ మొహమే నా కళ్ళముందు కనబడేది. ఒక్కొక్కసారి భాస్కర్‌ని, సుభద్రని చిత్రవధ చెయ్యాలనిపించేది.

పోయేవాళ్ళు మొదటిలోనే పోక, నా ఈ ప్రేమ బంధాన్ని ఎందుకు పెరగనిచ్చారు అనుకునేవాడిని. ఏమీ చేతగాని, చెయ్యలేని నిస్సహాయస్థితిలో ఎక్కడున్నా, నా సుశీ సుఖంగా ఉండాలని ప్రార్థించే వాడిని.

రాణీ! ఈ స్థితిలో పేదవానికి పెన్నిధిలాగా నువు కన్పించావు. మొదటిరోజు పరధ్యాన్నంగా ఎటో చూస్తున్న నాకు నిన్ను చూడంగానే సుశీ ఏమోననిపించింది. పోయిన సంపద తిరిగి లభించి నట్లు మనసు సంతోషపడింది. నిన్ను ఒక్కసారిగా ఎత్తుకోవాలని నీవైపు రాబోయాను. రాణీ! ఏది అభాగ్యుని ఎక్కడకు వెళ్ళినా వెంట తరుముతూనే ఉంటుంది. నన్ను చూసి భయపడటం స్పష్టంగా గుర్తించాను. నా గుండెల్లో శూలాలు గుచ్చినట్లయింది.

భగవాన్! నా రూపుతో నా భార్యకి ఏహ్యత కలిగించావు. నా సుశీని దూరం చేశావు! ఇంక ఏ ప్రాణినీ దగ్గరకి రానివ్వవా? నన్నెందు కిలా సజీవ సమాధి చేస్తావు' అని నా మనసు రోదించింది. నువు పరుగు పెడుతూ వెళ్ళిపోయావు నా క్షణికోత్సాహం నశించి పోయింది.

రాణీ! మా ఇంటిదగ్గర చాలామంది సుశీ వయసు వాళ్ళు నా దగ్గర చనువుగానే ఉండేవాళ్ళు. కానీ, నాకు వాళ్ళల్లో ఏ ఒక్కళ్ళల్లోనూ సుశీ కన్పించేది కాదు. నిన్ను చూడగానే సుశీ నా దగ్గరకు తిరిగి వచ్చినట్లనిపించింది. ఇది ఎందువల్లనంటావు రాణీ! బహుశా పూర్వజన్మ ఋణానుబంధమేమో!

నాకు తెలుసు రాణీ! నువు నన్నుచూసి భయపడినా, నీ దృష్టులు రోజూ మా ఇంటిముందర వెతుకుతుండేవి. నా కోసమేకదూ రాణీ! అవును. నిశ్చయంగా నీ చిన్నారి హృదయంలో నాకు కొంత చోటుంది. అది నా మనస్సు మొదటిలోనే గ్రహిం

చింది. నా రూపం నీ అభిప్రాయాన్ని వెలువర్చటానికి అడ్డుపడిందికదూ రాణీ!

నిన్ను చూసిన ప్రతిసారీ ఒక్కతడవ గాఢంగా హృదయానికి హత్తుకొని నన్ను నేను మర్చిపోవాలని ంచేది. కానీ, అంత పని చేస్తే ఇటునించి వెళ్ళటమే ానేస్తావేమోననే భయంతో నన్ను నేను విగ్ర ాంచుకున్నాను. కానీ రాణీ ! రోజు రోజుకీ నా ోర్కె బలీయం కాసాగింది. ప్రతిక్షణము నువ్వే ళ్ళముందు కన్పించేదానివి. నా మశీ ఖాళీ చేసిన ్థానాన్ని నువ్వాక్రమించావు.

అందువలననే రకరకాలయిన ఆట—వస్తువు ుతో విన్నాకర్షించటానికి ప్రయత్నించాను. వింత ంత వస్తువుల మోజులోనైనా భయపడకుండా ా దరికి వస్తావేమోనని ఆశించాను. నా ఆశ నిష్ఫల ుయింది. ఆశతో కూడిన నీ చూపులు నన్ను చూసి ిరాశపడేవి.

రాణీ! ఆ దినం నువ్వు బెలూన్లవంక చూస్తూ పడిపోయావుకదూ? నీకు తగిలిన దెబ్బ నా హృ యానికి గాయం చేసింది. లేవతీద్దామని వస్తుంటే నువ్వు చూసిన చూపుల్ని నేను మర్చిపోగలనా రాణీ! ్రీతహరీక్షణ అని స్త్రీని ఎందుకన్నారో నా కారోజు తెల్సింది. నువు రావద్దన్నట్లు తలూపుతుంటే నా హృదయం ముక్కలైంది. పడిన పాపని లేవతీయ టానికి కూడా అసమర్థుణ్ణి చేశావా తంత్రీ అని విలపించాను.

రాణీ! నీ తలనిండా గులాబీలు తురిమి, నీ ముంగు రులు సవరిస్తూ, నీ పాలబుగ్గల్ని గాఢంగా ముద్దు పెట్టుకోవాలని మనస్సు తహతహలాడేది. కానీ, నా అసమర్థతని పెరటిలోని గులాబీలు పరిహసించేవి. ఆదరించేవారులేక అవి అలా చెట్టునే వడిలిపోయేవి.

ఇలా మూడు నెలలు గడిచిపోయాయి. ఆరోజు ఆఖరుగదూ రాణీ నువ్వా త్రోవమ్మట వెళ్ళటము! అవును. ఆరోజు—మశీ కిష్టమయిన గులాబీరంగు గౌను ధరించి, రెండు జడల్లోనూ గులాబీదండ పెట్టుకుని నుదుట ఎర్రని బొట్టుతో అమాయక మైన కాటుక కళ్ళతో భుజాన సంచితో బడికి వెడుతుంటే, "పెళ్ళికూతురులా ఉంది" అనుకున్నాను విన్నల్లంత దూరంలోచూసి. నా మశీ పుట్టినరోజు పండుగనాడు అచ్చు అలాగే తయారయ్యేది. రాణీ! ఆ రూపంలో నిన్నొక్కసారి ఎత్తుకోవాలనిపించింది. నాలో పొంగిపోయే ప్రేమ ప్రవాహాన్ని ఆపుకోలేక పోయాను. అక్కడికీ చేతులుజాపి విన్నాహ్వానించాను. నువ్వు కొంటె చూపులు చూస్తూ, నవ్వుతూ రానన్న ట్లు తలూపుతుంటే నా హృదయాన్నరికట్టలేక పోయాను. అంత ముద్దు వచ్చావు రాణీ ఆరోజు నువ్వు. ఒక్కసారిగా నా చేతుల్లోకి తీసుకుని ముద్దు లతో నింపేశా. నా జీవితం సంతృప్తితో నిండి నట్లనిపించిం దా క్షణంలో. ఈ నిర్భాగ్యుడు అంత కంటె ఎక్కువ ఎలా ఆశించగలడు రాణీ!

కానీ నా సంతోషమంతా ఒక్క క్షణంలో భగ్న మయింది. నువ్వు "మాంత్రికుడు", "భయం" అంటూ కలవరించి స్పృహ కోల్పోయావు. నా హృదయం ఒక్కసారిగా ఆగిపోయింది. నా మూలంగా ఈ చిన్నారిపాపకి కూడా కష్టం తెచ్చిపెట్టానే అని విలపించాను. ఏం చెయ్యాలో పాలుపోలేదు. విన్నలాగే చేతులమీదుంచుకుని పరుగుపెడుతూ మీ ఇంటికి తీసుకువచ్చాను.

బయట మీ నాన్నగారు కూర్చుని ఉన్నారు. నా చేతుల్లో విన్ను చూడంగానే ఆయన అమితమయిన ఖంగారు పడిపోయారు. విన్ను మంచంమీద పడుకో బెట్టి, మొహాన నీళ్ళు చిలకరించి విసరసాగారు. మీ అమ్మగారు బయటకొచ్చి, "ఏమయిందండీ? మీ రెవరు?" అని అడిగారు ఆదుర్దాగా. నే నెవర్నని చెప్పను రాణీ! నే నెవర్నయినా తన బిడ్డకి హాని కలి గించిన నన్నామె క్షమించదనిపించింది. నెమ్మదిగా తలవంచుకుని జరిగిన సంగతి చెప్పాను. "చూడండి! పిల్లలు ఒక్కసారిగా భయపడితే వాళ్ళ ప్రాణానికే అపాయం వస్తుంది. మీరంటే దానికి భయమని తెల్సుకదా? అలాంటప్పుడు దాన్ని ఎందుకంతగా జడిపించారు? అయినా పిల్లలుంటే ఇలాంటివన్నీ తెలుస్తాయిగానీ, ఉట్టివాళ్ళకేం తెలుస్తాయి" అనేసి, ఆమె కళ్ళు వత్తుకుంటూ గిరుక్కున ఇంట్లోకి వెళ్ళిపోయారు.

రాణీ! నే నామెకి ఏమని చెప్పగలను? అవును పిల్లలుంటే అలాంటివి తెలుస్తాయి. నాదనుకున్న నా మశీయే నాది కాకపోయింది. ఇంక నాకు పిల్ల లెవ్వరు? ఆమె చాలా మృదువుగా మందలించారనుకున్నాను. మీ నాన్నగారు బయటకి వచ్చారు. "ఎలాఉందని" అడిగాను. ఒక్కక్షణం నా వంక చూశారు. ఆ చూపు లో చిత్ర విచిత్రాలయిన భావాలున్నట్లు కన్పడింది. "ఇప్పుడే కళ్ళు తెరిచింది" అన్నారు. ఒక్కసారి తేలిగ్గా ఊపిరి పీల్చాను.

లోని కొకసారి తొంగిచూశాను నీవు మీ అమ్మ గారివంక చూస్తున్నావు. వెనకకి తిరిగి నెమ్మదిగా "క్షమించండి" అనేసి తలవంచుకుని వెళ్ళిపోయాను. అడుగులు భా[illegible] తోచాయి.

[illegible] ఆ తరువాత విన్నెప్పుడూ ఆ దోవమ్మట [illegible] రోజూ కళ్ళు కాయలు కాచేలా చూసే [illegible] ఇంక నువ్వావైపుకు రావని తోచి మీ ఇంటి పరిసరాల్లో దూరంగా నుంచుని నీ కోసం వెదికే వాడిని. నువ్వొకసారి కనపడగానే సంతృప్తి చెందిన హృదయంతో ఇంటికి వెళ్ళిపోయేవాడిని. కానీ, విధి నా ఈ అదృష్టానికి కూడా ఈర్ష్యపడింది.

ఒకరోజున మీ ఇంటి ఎదురుగాఉన్న ఇంటి వాకిలిముందు నిలబడిఉన్నా. మీ నాన్నగారటు వస్తూ, నన్ను చూసినట్లున్నారు. నే నాయనను గమనించలేదు. నా దృష్టి నీకోసం వెదుకుతోంది. వెనకాలగా వచ్చి భుజంమీద చెయ్యివేసి "మీరా?" అన్నారు. ఆయన కనుబొమ్మలు ముడిపడి ఉన్నాయి. నా కా పదంలో "మళ్ళీ ఎందుకు వచ్చావు" అన్నట్లు వినపడింది. ఆయనింకేమి మట్లాడకుండా తీవ్రంగా ఒక చూపు చూసి వెళ్ళిపోయారు. నాకు దొంగ తనం చేసినట్లనిపించింది.

అటుపైని ఆ పరిసరాల ఛాయలకి కూడా రాలేక పోయాను. రాణీ! ఎంతటి ఆరోగ్యవంతులయినా నిద్రాహారాల్లేకపోతే ఎంతకాలమని ఉంటారు రాణీ! ప్రస్తుతం లేవలేని పరిస్థితుల్లో ఉండిపోయాను. పాపం అంతా పని మనిషే చూస్తోంది. దానికి నా బరువింకా ఎన్ని రోజులో తెలియటంలేదు.

రాణీ! నా కథ విన్నావు కదూ! ఈ అభాగ్యుడు జీవి తంలో అన్ని విధాల వచించబడ్డాడు. తన సొమ్ము పరులపాలవగా, పరుల సొత్తుకోసం పాటుపడిన ప్రేమోపహతుడిని. నా కీ జీవితంలో ఇంకా ఒక్కగా నొక్క కోరిక మిగిలి ఉంది. రాణీ! మరణించేలోగా ఒక్కసారి నిన్ను చూడాలి. నా కా అదృష్టం కలుగు తుందో లేదో చెప్పలేను. మరొక్క కోరిక రాణీ! నా మశీకి అత్యంత ప్రియమయిన నా పెన్ను నీ కివ్వాలనుంది. స్వీకరించవా రాణీ? నా ఈ ఒక్క ముద్దు చెల్లించు.

రాణీ! ఎప్పుడయినా నీ ప్రియాతి ప్రియ మయిన బిడ్డ ఈ పెన్ను ఇవ్వమని అడిగితే ఇవ్వకేం? ఇచ్చేస్తే నన్ను మర్చిపోతావేమో"

పితృప్రేమనుంచి వంచితుడయిన ఈ అభాగ్య జీవిని మర్చిపోకు రాణీ. నా ఈ గాథ నీకు గుర్తు వచ్చి నప్పుడు ఒక్క కన్నీటిబొట్టు విడు. దానికే నా ఆత్మ ఏ లోకంలోనున్నా ఎనలేని సంతోషం పొందుతుంది.

రాణీ! నువ్వు విద్యావతివై, శీలవతివై, పెండ్లి కొమార్తెవై, గృహిణివై, తల్లివై, బిడ్డలతో, సకల సంపదలతో పదికాలాలు వర్థిల్లాలని నిండు మనసుతో ఆశీర్వదిస్తున్నాను. నా కోర్కె తప్పి కుండా సఫలమవుతుంది. భగవంతుడు నీకు తోడు నీడగా ఉంటాడు. ఈ అభాగ్యుని మర్చిపోకు.

ఇట్లు,

జీవితంలో ఎవరి ప్రేమనీ పొందలేని ఒకానొక

వ్యథిత హృదయుడు నీ మాంత్రికుడు.

* * *

'రాణీ' అన్న పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాను. ఆలోచన్లు ఆగిపోయాయి. ఎదురుగుండా వారు సోఫాలో కూర్చుని బూట్లు విప్పుకుంటున్నారు.

"ఏమిటి రాణీ! మశీ నీమీద రిపోర్టు చేస్తోంది. అదేదో పెన్నడిగితే ఇవ్వనన్నావుటగా" అంటూ తలెత్తారు. బుంగమూతి పెట్టుకుని మశీ పక్కనే నుంచుంది.

నా మొహంవేపు చూస్తూనే 'అదేమిటి, అలా ఉన్నావు? ఒంట్లో బాగా లేదా" అంటూ దగ్గరగా వచ్చారు. హఠాత్తుగా ఆయన దృష్టి బరువుమీది ఎర్రని పెన్‌మీద పడింది. నావైపు ఒక్కక్షణం జాలిగా చూసి వెనక్కి తిరిగారు.

"చూడు మశీ! ఈ పెన్ను ఇప్పుడు అవుట్ ఆఫ్ ఫ్యాషనమ్మా. రా,మనం కొత్త పెన్ను కొనుక్కుందాం" అంటూ మశీని వెంటబెట్టుకుని వెళ్ళిపోయారు. ★

వెనుకటికి వాటికన్ పోపు మందిరంలో తోటలోని తిరుగు తున్నాడు ఆ యిరుగు పొరుగు యిళ్లల్లోని వాళ్ళగుపించకుండా గోడకడుతున్నామన్నారు అధి కారులు. "ఏం నేనంత అమర్యా దస్తు న్నన్నా" కొన్నారా? అన్నారు పోపుగారు.

## బంగారు పంజరం

22—వ పేజీ తరువాయి

గూర్చి కొన్ని సంగతులు డాక్టర్ నడగాలని వెళ్తున్నాను వదినా ! నువ్వేమీ అనుకోకు — పోనీ అవన్నీ నువ్వే చెబుతానంటే వెళ్ళటం మానేస్తాను. నా సందేహాలను తీరుస్తావా ?"

నిర్మల మాలతి భుజాలమీద చేతులువేసి ఆమె కళ్ళలోకి సూటిగా చూచింది. "నాకంటే తెలివిగలదానివి, పెద్దదానివి, నీ సందేహాలను నేను తీర్చలేను. డాక్టర్ద్వారా అన్నీ తెలుసుకో—మాలతీ! నాలో యేమైన తప్పుంటే క్షమించు" అంది.

అప్పుడే పనిముగించుకుని యిల్లుచేరిన డాక్టర్ శాంత ఒంటరిగా వచ్చిన మాలతికేసి ఆశ్చర్యంగా చూస్తోంది. డాక్టర్‌కు మాలతి అంటే ప్రత్యేకాభిమానం, మమత ఉన్నాయి. మాలతి—రాక ఒకింత ఆశ్చర్యం గొల్పింది.

డ్రాయింగ్‌రూంలో కూచోబెట్టి డాక్టర్ గృహకృత్యాలలో కొంతసేపు నిమగ్నయై తర్వాత వచ్చి కూచుంటూఅంది:

"విశేషముంటే గాని రావమ్మా నీవు—ఏముం దేమిటి ?"

మాలతికి యెలా ప్రారంభించాలో బోధపడ లేదు. డాక్టర్‌కేసి కన్నార్పకుండా చూస్తూ అంది "వదిన విషయం కనుక్కుందామని వచ్చాను."

డాక్టర్‌శాంత మాలతి భుజంమీద చేయివేసి ప్రేమపూర్వకంగా అంది "నా ఆడబిడ్డ నిర్మలకూడ నా విషయం నీలాగే తాపత్రయపడేదమ్మా. నిర్మల విషయం, నీ ఆతృత చూస్తుంటే మా నిర్మల జ్ఞాపకం వస్తోంది.... ఏం చెప్పమంటావు ?"

"వదిన బొంబాయినుంచి విక్షిప్తలా వచ్చింది. ఆమె ప్రవర్తన నాకెంతో భయంగొల్పింది. తిరిగి మిమ్మల్ని కలుసుకున్నాక ఆమె పూర్వపు జీవిత విధానాన్ని ఉత్సాహంతో స్వీకరించింది. ఇదెలా సంభవమైంది ? బొంబాయి విశేషాలేమిటి ?.... డాక్టర్! మీకు తెల్పాలనిఉంటేనే చెప్పండి. లేకపోతే చెప్ప వద్దు. మీకు అసలు తెలుసా ? అన్నయ్య విషయం యేమని తేల్చారు ? వదిన అంతగా మారిపోయి రావటానికి గల కారణం యేముంది ?"

డాక్టర్ సోఫాలో చేరగిలబడి చేతులుకట్టుకుని కూచుంది. మాలతి యేమి వింటానో అని భయంగా యెదురు చూస్తోంది.

"నిర్మల అంతా చెప్పింది. నీతో చెప్పాలనుకుం దిట. ధైర్యం చాలక నా దగ్గరకు వచ్చింది...."

"ఎందుకంత అధైర్యం కల్గింది ? నే నెప్పుడూ వదిన చర్యలను నిరసించలేదే ? ఆమెపై నాకెంతటి పూజ్యభావముందో మీరు గ్రహించలేరా డాక్టర్ ? ఇంతకుముందున్న చనువేమైందో ? నాతో అంతగా మాట్లాడదు ! నే నేం చేశానో నాకే తెలియదు. వదినెకు నామీద మునుపుండే అభిమానం వాత్సల్యం యేమయ్యాయి? ...."

మాలతి కళ్ళనీరుపెట్టింది.

డాక్టర్‌శాంత గబుక్కున లేచి కూర్చుని మాలతి నడుంచుట్టూ చేయివేసి ప్రేమతో అంది

'ఛా .. అలా యేడుస్తారా చెప్పు ? . నీ గురించి కాదమ్మా. నిర్మల తనను తాను అసహ్యించుకుంటుంది. తనపై తనకే నమ్మకం కుదరటంలేదు. ఎప్పుడూ లేని నిరాశ ఆమె నావరించింది. ."

"ఎందుకు ?" మాలతి కనుబొమలు విట్లించి అంది

"వివరిస్తా విను. ఒక రోజు రెండుసంవత్సరాల క్రితం అనుకుంటా— నానుంచి యెన్నో విషయాలు తెలుసుకుంది. డాక్టర్‌గా కొన్ని సలహాలిచ్చాను. ఆమె ఆచరిస్తుందని నాకు నమ్మకంలెదు. కానీ చెప్పాను; వివరించాను; అంతా వినింది. తర్వాత రెండేళ్ళు దాటాయి— నిర్మల ఆ విషయాలు మర్చిపోయిందేమోనని భావించాను. ఆ విషయాలను మరియెత్తలేదు.

"బొంబాయికి వెళ్ళింది. అన్నయ్యకు బాగ లేదు; అయినా చూడాలని ఆశించింది కాబోలను కున్నాను. వెళ్ళిన వారానికి నిర్మలనుంచి జాబు వచ్చింది.... తను ఆపరేషన్ చేయించుకున్నట్లు...."

మాలతి స్తంభించిపోయి చటుక్కున స్పష్టంగా అంది.

"ఆ.... ఆపరేషనా ? ఎందుకు ?.... ఓహో"

డాక్టర్‌శాంత మాలతి అన్ని విషయాలు అర్థం చేసుకోవాలన్నట్లుగా కొంత సమయం యిచ్చింది. మాలతి హృదయంలో ఆ మాటల్లోని భావం ఒక తీరుకు వచ్చింది. ఆమె మననం చేసుకుంటోంది. ఇంకా చెప్పమన్నట్లు డాక్టర్‌వైపు చూచింది.

"రెండు సంవత్సరాలు ఆమె తర్జనభర్జన చేసు కుంది. ఎంతకూ ఒకనిర్ధారణకు రాలేకపోయినట్లుంది. మరి ఉన్నట్లుండి ఒక నిశ్చయానికి వచ్చినట్లుంది. ఆలసిస్తే తన నిశ్చయానికి భంగం కల్గుతుందని కాబోలు వెంటనే వెళ్ళిపోయింది.... సరే.... వెళ్ళిన పని అయింది.

"కానీ మాలతీ— అంతలో అనుకోని సంఘటన ఆమెను పూర్తిగా నిరాశతో నింపింది. ఈ పరిస్థితి కల్పించుకున్నందుకు తనను తాను క్షమించుకో లేక నిస్పృహతో తిరిగివచ్చిందమ్మా.... ఆపరేషన్ అయిన రెండవరోజునట, అన్నయ్యకు హఠాత్తుగా జ్ఞానం కల్గింది. అమ్మ, నాన్న, నిర్మల, మాలతి, పాప అంటూ వాళ్ళను చూడాలన్న కోర్కెతో తాళలేకపోయాడు. రుక్మిణమ్మ యేం చేస్తుంది ? ఏం చేయగలదు పాపం ? నిర్మల విషయం రహస్యంగా వుంచాలి. అన్నయ్య కోర్కెపై మిమ్మల్ని పిలిపిస్తే గుట్టంతా బహిర్గత మవుతుంది. నిర్మలను నిందించుకుంటారు. సావిత్రమ్మ నిర్మలను క్షమించలేదు. నిర్మలపై ఉన్న గౌరవం కొన్ని సన్నగిల్లుతుంది. ఇదిజరగటమంటూవుంటే నిర్మల భావిజీవితం దుఃఖమయం అవుతుందని భావించి రుక్మిణమ్మ ప్రకాశ్‌ను యింటికి తెచ్చింది. పాపం ఆమె యెంత కుమిలిపోయి, తానుచేస్తున్న పనికి యెంతవిలవిల్లాడి పోయిందో. నిర్మల కీ విషయం చెప్పకండా దాచారు. ప్రకాశ్ రోజురోజుకు మిమ్మల్ని అడగటం మొదలెట్టి చివరికి వారం రోజుల్లో తిరిగి మతిపోగొట్టుకున్నాడు.

'నిర్మల మామూలుగా మూడువారాలయ్యాక యింటికొచ్చిందట. రుక్మిణమ్మ తన వ్యథనంతా అణచుకుని యెప్పటకి మళ్ళే ప్రవర్తిస్తోందట. కానీ నిర్మల రుక్మిణమ్మను చూడగనే యేదో విశేషం వుందని పసిగట్టింది. ఇలాటి విషయాలు దాగవు కదా? నిర్మల మూడురోజులు మామూలుగానే ఉందిట. నాలుగవరోజు మేడమీదికెళ్తే ప్రకాశ్ వ్రాసిన ఉత్తరం కనబడింది. బాగున్నప్పుడు హైదరాబాదుకు వ్రాసి పోస్టు చేయటానికి మర్చిపోయాడు కాబోలు తలగడక్రింద పెట్టాడుట. వరువులు యెండలో వేయిస్తోందట. జాబు జారి క్రిందపడింది. ఇంకేముంది పిచ్చిగా అరుస్తూ పరుగెత్తి రుక్మిణమ్మను అంతా చెప్పమని యేడ్చిందట. ఇక దాచి లాభంలేదని రుక్మిణమ్మ, ప్రకాశ్ రావటం, తిరిగి వారంలో వెళ్ళిపోవటం అంతా చెప్పిందట.

"రెండేళ్ళుగా భర్త ప్రాజ్ఞ డెప్పుడవుతాడా, యెప్పుడు చూద్దామా అని వేయికళ్ళలో నిరీక్షిస్తున్న నిర్మల కీ మాటలు శరాఘాతాలయ్యాయి. బిగ్గరగా యేడ్చిందట. నాదే తప్పు, మిమ్మల్నింత క్లిష్ట పరిస్థితిలో యిరికించాను. తల్లి, దండ్రి చెల్లి, బిడ్డలను వారినుంచి దూరం చేశాను.

గురువు : ఇదేమిరా ? ఇలా ఆవును తీసుకువచ్చేస్తున్నారు క్లాసులోనికి...

శిష్యుడు : మరే! దానిమీద కాంపోజిషన్ రాయిస్తా మన్నారుగా.

జాన్‌రాజా, (విజయవాడ)

ఈ సమయంకోసం అనుక్షణం నిరీక్షించే వాళ్ళు, ఈ సంతోష సమయం అనుభవించకండా అడ్డగించిన దాన్ని నేను. వారెంత కుమిలిపోయారో? మమ్మల్ని చూడాలని యెంత తహతహలాడారో ? నేను ఇంత సమీపంలో ఉండికూడ దూరంగానే ఉన్నాను. నేను చేసింది క్షమింపరాని నేరం— నాకు ముక్తిలేదు— నేను క్షమార్హురాలిని కాను. రహస్యంగా చేయదల్చుకున్నందుకు భగవంతుడు సన్ని విధంగా శిక్షించాడు. నేను హైదరాబాదే వెళ్ళలేను — వారి ముఖాలు చూడలేను—అన్నయ్య యెలా ఉన్నారంటే — బాగయ్యారు—మిమ్మల్ని చూడదల్చారు—కానీ .... అంటూ నిజం చెప్పలేను.... వారి దుఃఖం చూడలేను. నేను మామూలుగా ప్రవర్తింపలేను. నా జీవితమే సర్వనాశనం చేసుకున్నాను. పయోముఖవిషకుంభాన్ని ...." ఇలాగే మాలతీ! పశ్చాత్తాపంతో కుమిలిపోయింది. రుక్మిణమ్మ ఎంతగానో ఓదార్చి పంపింది.

"ఇది జరిగిన తరువాత మామూలుగా నాకు వ్రాసింది. తనకు సానుభూతి అత్యవసరం. తను కోరి చేసిన నేరంకాదుగదా ? వెంటనే రమ్మనమని వ్రాశాను. తనకిక నిష్కృతి లేదన్నట్లు వ్రాసింది.

"వచ్చింది కానీ వెంటనే ముఖంమూసలేక పోయింది. ఉత్తరం వ్రాసి నరసుతో పంపిసూ వచ్చింది. గతజలసేతు బంధనం యేం లాభం చెప్పు ? మనమనుకొన్నలా సంభవిస్తే బాగుం టుంది గానీ, విధి మనకు అగమ్యగోచరంకదా ? నీవు కావలసి చేసిన తప్పుకాదని బోధించాను. మీ కుటుంబంలో ఆమె స్థానం గుర్తుచేశాను. ఇలాగా పశ్చాత్తాప పడుతున్నావు, నీవు క్షమార్హురాలివే అని చెప్పాను. నా మాటలు నమ్మిందికాబోలు కొంత వరకు ఉపశమనం పొందింది."

చెంపకు చేయిఆన్చి విభ్రాంతితో వింటున్న మాలతి కళ్ళనిండా నీళ్ళు తిరిగినై. దుఃఖంపట్టలేక రెండుచేతులలో ముఖం దాచుకుంది. డాక్టర్ శాంత ఆమె తలను మృదువుగా నిమురుతోంది.

"మీ స్వరం వింటే చాలు—డాక్టర్— అందరూ తమ విచారాన్ని మర్చిపోతారు— అందుకే వదిన — అంత త్వరగా పూరడిల్లింది—అమ్మ ఇందుకే గదా మిమ్మల్ని పిలిపించుకుంటుంది — నిజంగా వదినతప్పులేదు — పాపం యెంత వ్యథతో బాధపడుతుందో—"

డాక్టర్‌శాంత గొంతు తగ్గించి నెమ్మదిగా అంది "ఈ విషయాలు నీ హృదయంలో భద్ర పర్చుకోవాలమ్మా మాలతీ."

మాలతి సరేఅన్నట్లు ఆమెవైపు చూచింది—" మీకెంతో కృతజ్ఞులం. మా వదినను యెప్పటి కప్పుడు మారుస్తున్నారు. ఆమె లేకపోతే మేమంతా యేమయ్యేవాళ్ళం ? అంతేకాదు— అసలు మీరు లేకపోతే మా గతి యేమయ్యేది ?"

"నన్ను పొగుడుతున్నావా మాలతీ?"

మాలతి చిన్నగా నవ్వింది. "వెడతాను— ఆలస్యమైంది -- మీ సమయమంతా మాకోసం వినియోగిస్తున్నారు" అంది.

"మరి ఫీజ్ యివ్వవూ? బిల్లు పంపనా ?"

"తప్పకండా — ఎంత ఫీజు ?"

"నువ్వే కావాలి — వుండిపోకూడదు ?"

"ఓ—దానికేం గానీ — ఓ మారు వదినను చూడాలి. వెళ్ళివస్తాను" అంటూ క్రొత్త సాయంతో నడుస్తూ వెళ్ళిపోయింది.

సంధ్యకాలపు అరుణకాంతులు ఆమెముఖంలో ప్రతిఫలించినై. ఆమె ముఖంలోని ప్రశాంతతను, నైర్మల్యాన్ని చూస్తూ కారుప్రక్కన నించున్న డాక్టర్ శాంత హృదయం ఆనందంతో విప్పారింది. మాలతిని కారెక్కించింది.

కదిలిపోతున్న కారువైపు చూస్తూ "మానవత్వం సంపూర్ణత చెందిన యీమెకు యిలాటి స్థితి భగవంతుడెందుకు కల్పించాడో.... బహుశః నిర్మలకు చేదోడుగ ఉండి కుటుంబాన్ని నడిపించటానికి కాబోలు" అనుకుంది.

కాని విపరీతపు భావనావీచికలు కన్పించాయి. సంధ్యదాటి చిరుచీకటి అలముకుంది. అక్కడే మెట్లమీద కూచుంది. ఎంతసేపు గడిచిందో, ఆమె కళ్ళలోని కన్నీటి బిందువుల్లో నక్షత్రాలు ప్రతిఫలించి మెరుస్తున్నాయి. ఏనాడో తనహృదయంనుంచి, దృష్టిపథంనుంచి, దూరంచేసుకున్న తన వారంతా ఆ కటికచీకటిలో తనకు తేటగా అగుపించారు.

వాస్తవికతకు వచ్చి భారంగా లేచి లోపలికెళ్ళిపోయింది.

*　　*　　*

కొన్ని మాసాలు కలిసిపోయాయి. పాపకు వేసవి సెలవులిచ్చారు. పిల్లలిద్దరితో నిర్మల రామచంద్రపురం బయలుదేరింది.

రాజమండ్రీనుంచి వారి గ్రామానికి పోయే దారి చాలా బావుంటుంది. కాలవ ఒడ్డున బస్ పోతుంటే పిల్లల ఆనందం యింతింతకాదు. పడవలను చూడటం బాబుకు అదే మొదలు. "అమ్మా బస్ పడిపోతేనో" అని నిర్మలను గట్టిగ పట్టుకునే వాడు. వేసవికాలం కావటంమూలాన సస్యశ్యామలంగాలేదు. కానీ కాలువమీదనుంచి వీచే చల్లగాలి వారి హృదయాల మత్తెజితులుగా చేస్తోంది. నిర్మల కీ ప్రయాణం అత్యంత ప్రియమైనది ఇప్పుడుకాదుగానీ వర్షాకాలం, దాటాక రావాలి— చెరుకుబళ్ళు దారిపొడుగునా భారంగా సాగిపోతుంటే యెద్దుల మెడల్లోని మువ్వల నాదం హృదయంలో నాట్యం చేస్తుంటే పచ్చని పైర్లతో కళకళలాడుతున్న ప్రకృతికాంత నీలాల సరులు వేసుకున్నలా గలగల ప్రవహిస్తున్న గోదావరి కాలువలతో—కన్నుల పండువుగా హృదయరంజకంగా ఉంటుంది.

ఎండ యెక్కువవుతోంది — వడగాడ్పులు ప్రారంభమైనై. నిర్మలస్మృతులనుంచి తేరుకుంది. దూరంగా తను పుట్టి పెరిగిన ఊరు అస్పష్టంగా కనబడుతోంది.

"రాముతోనే రాలేకపోయావా తల్లీ— ఒంటరిగా రాకపోతే" ప్రసాద్‌గారు బస్‌స్టాండుకొచ్చి అన్నారు.

"సెలివి స్టేషన్ కొచ్చింది.... మరి అనవసరంగా మీరు రావటం దేనికనుకున్నాను" నిర్మల బాబునందిస్తూ అంది.

గుమ్మంలో యెదురుచూస్తూ కూచున్న కమలమ్మ, ముందు బాబు నందుకునేందుకు లేచివచ్చింది వాడిని దింపి అరుగుమీద నుంచోబెట్టి యెగాదిగా చూస్తోంది — బాబు బెదిరిపోతూ బిక్కముఖం వేసుకుని చూస్తున్నాడు.

"నిర్మలా! ఏ దెలావున్నా — ఆ ముక్కు, గడ్డం అంతా నీ పోలికేనే ,అమ్మాయ్'' అంటూ వాడిని అమాంతంగా చంకవేసుకుని పకపక నవ్వింది.

"మరి అక్కలా వుండక యింకెవరిలా వుంటాడేం" అంటూ సామాను లోపల సర్దాడు రాము

భోజనాలయ్యాక పెద్దవాళ్ళంతా హాల్లో చేరారు. పిల్లలు పడుకున్నారు.

"నిర్మలా— అంతా చెబుతావుగాని యెవరి పిల్లాడో చెప్పవేం" అంది కమలమ్మ.

నిద్రపోతున్న బాబువైపు చూస్తోంది నిర్మల. నవ్వి అంది "నా పిల్లాడు కాదటమ్మా— ఎవరి పిల్లాడంటావేం"

"సరి—సరి అసలు సంగతి చెప్పరాదూ ?"

"అదంతా అనవసరం—వాడిని ఎప్పుడైతే నా చేతుల్లోకి తీసుకున్నానో ఆ క్షణంనుంచే వాడు నా కన్నకొడుకయ్యాడు. నా కడుపున పుట్టినవాడనుకుంటే యీ ప్రశ్న వేసేదానివికావు" అంది

కమలమ్మ క్షణకాలం నిరుత్తరురాలయింది.

# బంగారు పంజరం

నిర్మల బాబు ప్రక్కలోజేరి వాడి ముంగురులు సర్దుతుంటే మరేమి అడగలేకపోయింది. పెద్దగా నిట్టూర్చి నిర్మలవైపు చూస్తుండిపోయింది.

"మధు పరీక్ష లెలాచేశాడట ?"

కమలమ్మ న్వ్ప అంది.

"అంటే ?"

"అంటే ! యేముంది ? వాడసలు యెందుకూ పనికిరానివాడయ్యాడు. అర్థంలేని తిరుగుళ్ళు తిరుగుతున్నాడు. మన దగ్గరలేడని స్వేచ్ఛగా యిష్టం వచ్చినట్లు వ్యవహరిస్తున్నాడు. ఇంటిపట్టున వుంటే కాస్త మీ నాన్నగారికి సాయంగానైనా వుండేవాడు అదీలేదు. ఏ మన్నాలంటే రామువీద ప్రేమ మీకు—నే నంటే గిట్టదు అంటూ యెదురు తిరుగుతాడు కన్నందుకు పోషిస్తున్నాము— ఎప్పుడో మనందరితో తెగతెంపులు చేసుకుంటాడు వెధవలతో స్నేహంచేసి యిలా తయారయ్యాడు. ఒకసారి మీ నాన్నగారు వెళ్తే హాస్టల్ అధికారి చెప్పాడట—రెండునెలల హాస్టల్‌ఫీజు కూడా

ఓ జయరావు మరో సుబ్బారావుకి ఓ సలహా ఇచ్చాడు: నీకు ఏ దేనా విషయం జ్ఞాపకం ఉండాలంటే, నీవేలికో దారం చుట్టుకో. మరిచిపోవాలనుకుంటే మెడకో తాడు వేసుకుని వ్రేలాడు.

లక్ష్మణ్ రావు (మీనంబాకం)

కట్టలేదని. నెత్తీ నోరు బాదుకుని కట్టివచ్చారు ఎండలవల్ల పంటలు పోయె ఈయేడు మరీ కష్టపడిపోతుంటే మూలిగే నక్కమీద.... అన్నట్లుంది. మా సంగతి పోనీ అంతటితో ఆగిందా ? బోలెడు అప్పులుచేసి జల్సారాయుడిలా సిగరెట్లు త్రాగుతూ తిరుగుతున్నాడట అంతా సర్ది వచ్చేసరికి ఆరువందలైనై. ఇక్కడే అప్పుచేశారు..."

"పోనీ నాకు రాయకపోయావా అమ్మా" అంది నిర్మల— తనకు వ్రాయలేదన్నబాధ ఆమె స్వరంలో ద్యోతకమైంది.

"అవునమ్మా— మా అక్క బంగారు గని— మా అమ్మనాన్నల కెంతైన యిస్తుందనే, వాడిలా యెందుకూ కొరగానివాడయ్యాడు— నాకలానే అనిపించింది కానీ మీనాన్న ఒప్పుకోలేదు; అధికారం యింటిపెత్తనం అంతా అమ్మాయిదే అయినా, ఆ స్వేచ్ఛను యింతగా వాడుకుంటే పెద్దచిక్కులే రావచ్చు. అలా వుండనియ్ .. మన తిప్పలు మనం పడదాం— అన్నారు."

నిర్మల మాట్లాడలేదు. అది నిజమే. తన చేతుల మీదుగా వేలకువేలు ఖర్చవుతున్నా బాధలేదు గానీ, ఆ డబ్బులు కొంత తనవాళ్ళకోసం వినియోగించవలసి వస్తే "వాళ్ళ" అనుమతి కోరాలికదా. వారు అభ్యంతర పెట్టరని తెలుసు— కానీ అభిమానం అడ్డువస్తుంది—అడగటానికి వెనుదీస్తుంది. అలాగేగా రెండువారాలపాటు రాము విషయం అడుగుదామా వద్దా అని తనలోతాను ఘర్షణపడి చివరికి మాలతికి చెప్పుకుంది. ఆ తర్వాతివన్నీ యాంత్రికంగా గబగబ జరిగినై. రాముకు డబ్బు సాయమే కాకుండా అన్నీ సాయంచేసే యేర్పాటు చేశారు రాజారావుగారు. నిర్మల ఆలోచిస్తూ పడుకుని నిద్రపోయింది.

సాయంత్రం పిల్లల్ని తీసుకుని రాము, రవీ కాలువ గట్టుకేసి వెళ్ళారు. నిర్మల, కమలమ్మ, ప్రసాద్‌గారు అరుబయట కూర్చున్నారు. ప్రసాద్‌గా రన్నారు: "వసంతపిల్లలు నానా అవస్థ పడుతున్నారమ్మా— ఏం చెయ్యాలో తోచదు— అనుకుంటే హృదయం ద్రవించిపోతుంది"

నిర్మల తండ్రివైపు తెల్లబోయి చూచింది "నా కెవ్వరు రాయలేదే"

"రాసి యేంలాభం" అంది కమలమ్మ.

"పోనీ పిల్లల్ని తెచ్చేసుకుంటే"

కమలమ్మ పేలవంగా నవ్వింది. "పిచ్చితల్లీ, ఆలోచన మాకు తట్టలేదనుకున్నావా? పిల్లలు చాల చిక్కిపోయి నానా అవస్థపడుతున్నారని తెలిసి మీనాన్నగారు పరుగెత్తుకెళ్ళారు. ఆయనేమో నా పిల్లల్ని పంపనన్నాడుట. దానికెంత పొగరు—పిల్లల్ని తీసుకెళ్తానమ్మా అంటే, మళ్ళీ యెప్పుడు పిల్చుకొస్తారందిట—మీ నాన్నగారు 'అక్కడే ఉండిపోతారు; ఇక రారు ' అనేలాచెబితే 'అలాగయితే మీరుతీసుకెళ్ళకండి' అందిట. మీ నాన్నగారెంత బతిమాలినా ఆయన తన పట్టు విడవకుండా "ఇస్తానన్నప్పుడు తీసుకోలేదు, యిప్పుడెందుకు పంపుతాను?" అన్నాడట.

ప్రసాద్‌గారు సవార్లుచేస్తూ ఆగి అన్నారు "నన్ను బాగానే చూచారు. ఆ అమ్మాయి ప్రేమతో ఆదరించింది— పిల్లలు అమ్మా అమ్మా అంటూ చనువుగానే తిరుగుతున్నారు అందుకే నాకు కొన్నిసార్లు అనుమానంగా వుంటుంది— మనం వింటున్నదంతా ఉట్టి పుకారేనేమో —ఆ పిల్ల బిడ్డల్ని బాగానే చూస్తుందేమో."

"ఆ! మీదంతా చోద్యం గాని—మీరున్నంతసేపు బాగా చూచింది. మహా యెన్నిరోజులున్నారేమిటి ? ఒక్కపూట— అంతలో అన్నీ బయటపడ్తాయా ? నిజం నిలకడమీద తెలుస్తుంది గాని. నెలరోజు లుండి రండి—అంతా తెలిసిపోతుంది—జనా నిర్మలా — సవతి తల్లి మారుపిల్లల్ని సరిగా చూస్తుందటే యెక్కడైనా ?"

కమలమ్మ అది లోకసత్యం అన్నట్లుగా అంది. నిర్మల అర్థవంతమైన నవ్వొకటి నవ్వింది.

"వెళ్ళకముందు పిల్లల్ని చూడాలని ఉంది నాన్నా! ఒకసారి తీసుకురండి. కొన్నాళ్ళపాటు వుంచుకుని పంపుతాననండి" అంది నిర్మల.

నిర్మల కోరిక నెరవేర్చే నిమిత్తం ప్రసాదరావు గారు వేల్పూరెళ్ళారు, సాయంత్రానికి తిరిగి రావాలని— ఆ రాత్రికి ఆఖరు బస్సుదాకా చూచారు గానీ వారు రాలేదు.

మరునటిరోజు మధ్యాహ్నం గేటుదగ్గర బండి ఆగింది. లత—పాప, రాజా గుమ్మందాక పరుగెత్తారు

బండి ఆగిన చప్పుడు విని నిర్మల ఆతృతతో బైటి కొచ్చింది. పిల్లలకు తనసలు జ్ఞాపకమే ఉండదు. పెద్దవాడికైన ఉంటావా ? అనుకుంటోంది.

బండిలోంచి ఒక స్త్రీచెయ్యి ప్రసాదరావు గారికి మరచెంబు అందిస్తోంది. నిర్మల అలాగే చూస్తూ మంచుండిపోయింది. ఆ తర్వాత ఆకు పచ్చ కోటకొమ్ముల కంచిపట్టుచీర అగుపించింది. ఆ స్త్రీ క్రిందకి దిగి వసంత్‌ను దింపింది.

ఆమె కుందనపు బొమ్మలాఉంది. మంచి పొడ గరి; వంకీలు తిరిగిన జుట్టు—ఆ జడ పిరుదుమీదగా నడుందాక వచ్చింది. తలలో విరియబూచిన మల్లె చెండు. ఆమె యెవరో నిర్మల ఊహించుకుంది. లోపలి కెళ్ళిపోవాలన్న కోర్కెకు కళ్ళెం వేసింది. అలా వెళ్ళిపోతే ఆమె యేమనుకుంటుందో ?

"అమ్మా! శ్యామల వచ్చిందే" అని కేకేసింది నిర్మల.

వసంత్‌ను నడిపించుకుంటూ విద్యుల్లతలా వస్తోందామె. ముందుకు వచ్చేకొలది స్పష్టమవు తున్న ఆమె ముఖంలో కోపంగాని, ద్వేషంగాని, జుగుప్సగాని, సంతోషంగానీ యేమీలేదు. అన్నింటి కతీతురాలై సంపూర్ణత్వం సిద్ధించుకున్న యోగినిలా శాంతంగా వస్తోంది. స్తబ్ధురాలై నుంచున్న కమలమ్మకు దగ్గరగా వెళ్ళి ఆమెపాదాలకు నమస్క రించింది. కమలమ్మ హృదయంలో యేవో మరపు రాని భావాలు తలెత్తినై. కళ్ళలో నీళ్ళు సుళ్ళుతిరుగు తుంటే, అస్పష్టంగా ఆశీర్వచనాలు గొణిగి శ్యామ లను లేవనెత్తింది.

నిర్మల కదలింది. ఆమె అడుగువేయకముందే శ్యామల అంది "అక్కయ్యా ఆగండి" అది ఆజ్ఞ కాదు, ప్రార్థన.

నిర్మల స్తంభించిపోయింది. క్షణంసేపు ఆమె కళ్ళలోకి చూచి తిన్నగా మంచుండిపోయింది. శ్యామల వంగి, నిర్మల పాదాల నంటింది. నిర్మల నెమ్మదిగా ఆమె భుజాలనుపట్టి లేవనెత్తింది.

"మవ్వేమీ అన్యథా అనుకోకమ్మా.... ఏదో జ్ఞాపకంవచ్చి...."

నిర్మలను పూర్తిచేయనివ్వకుండానే అంది "ఫరవా లేదక్కయ్యా— నాకు తెలుసు"

నిర్మల పిల్లల్ని పలుకరించింది. వాళ్ళను యెత్తు కుని ఒళ్ళో కూచోబెట్టుకుంది. వసంత్ ముద్దు మాటలు విని ఆనందంతో తన్మయురాలైంది. ఇల్లంతా సందడి — గోల — పిల్లల అరుపులు. భోజనాలయ్యాయి. నిర్మల, శ్యామల లోక గదిలో చాపలు పరుచుకుని పడుకున్నారు.

నిర్మలమనసు పరిపరివిధాల పోతోంది. ఈమె యెందుకొచ్చినట్టు ? పిల్లలను తిరిగి పంపుతారో లేదో — అని భయమా ? ఈమెకెందుకింత మమత? ఇది చాలా విచిత్రంగాఉందే ? ఇంకొకరైతే పీడ విరగడైపోతుందని భావించేవారే ? ఈమె బుద్ధి మంతురాలిలా అగుపిస్తోంది— కాని అంతరంలో యెలాటిదోకదా ? ఈమె ఉద్దేశ్యాలేమిటో యెవరు గ్రహించగలరు ? వసంతమీద యెనలేని మమకారం—ఆమె స్థానం శ్యామల ఆక్రమించుకున్న దన్న ద్వేషం — ఈమె యెందుకొచ్చింది ? ఏ విష యాలు మాట్లాడబోతోందన్న భయం— వీటి పీడల తాలూకు భావఘర్షణతో నిర్మల సతమత మవుతోంది.

శ్యామల దూలాలవైపు చూస్తోంది. నిర్మల ఆలోచన కంతరాయం కల్గిస్తూ లేచికూచుంది. ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూస్తుండిపోయింది నిర్మల.

"నేను రావటం మీకెంతో ఆశ్చర్యంకదూ ?"

"ఊఁ" అంది నిర్మల.

"నాకు తెలుసు మీకెంత మనోవ్యధ కల్గిస్తు న్నానో — రాక తప్పిందికాదు."

"అంతటి విశేషముందా ?" నిర్మల ప్రశ్నిం చింది.

"ఉందక్కయ్యా — నాకు రావాలనిఉన్నా— మిమ్మల్ని చూడాలనిఉన్నా నా కిక్కడికి వచ్చేందు కేం హక్కుందని ? పోదామా, వద్దా అని ఘర్షణ పడి, యెటూ తేల్చుకోలేకపోయాము. ఇంతలో భగ వంతుడు పంపినట్లుగా నాన్నగారొచ్చారు. మీరే మైనా అనుకుంటారేమోనని నా వుద్దేశాన్ని కప్పి పుచ్చుకున్నాగానీ మీ మరిదిగారు కదిలేదాక ఊరుకో లేదు."

"మా మరిదిగారికి మేము జ్ఞాపకమున్నామా శ్యామలా ?" అంది నిర్మల.

శ్యామల చటుక్కున నిర్మల హృదయాన్ని

జడ్జి: నువ్వు నిన్ను పొడిచింది గుర్రం కాదని ఎలా చెప్పగలుగు తున్నావ్?

వాది: పొడిచింది గనుక యువరానర్—

రామావతారం (రాజోలు)

కదిలించినట్లు చూస్తూ అంది "మీ అందరిపైన వారికింకా భక్తి శ్రద్ధలున్నాయి. ముఖ్యంగా మీ రంటే యెంతో గౌరవం. పెళ్ళికి మీరిచ్చిన రేడి యోను చూచుకుంటూ యెప్పుడూ మిమ్మల్ని తలచుకుంటుంటారు. మీకు తెలియని విషయా లెన్నోవున్నాయి. వాటిని మీకు చెప్పాలని ఆశించారు గానీ, చెప్పలేక ఆ కష్టతరమైన పనికి నన్ను వినియో గించారు."

"ఎందుకమ్మా— అంత నాకు తెలియపర్చని విశేషాలేమున్నాయి ?"

శ్యామల వినమ్రతతో విసురుకుంటూ కొన్ని క్షణాలవరకు మాట్లాడలేదు. ఉన్నట్లుండి హఠా త్తుగా అంది.

"అక్కయ్యా! మీకు నేను పిల్లల్ని హింసిస్తు న్నట్లు యెవరు చెప్పారు?" నిర్మల స్తబ్ధురాలైంది. ఏమని చెబుతుంది ? ఈమె యిలా మాట్లాడుతుం దేం ? ఇంత నిష్కర్షగా మాట్లాడే ఆమెకు జవా బివ్వటం మహాకష్టం—నెమ్మదిగా అంది "నాన్నతో యెవరో అంటే, నాన్న నాతో అన్నారు—అంతే. పిల్లల్నిగూర్చిన చింత మాలో వుండటం తప్పు కాదను కుంటా"

"అక్కయ్యా— ఒక్కమాట చెబుతాను— న్యాయాన్యాయం విచారణ చేయించండి. పాప—లత బాబు చేతిలోఉన్న యే వస్తువునైనా బలవంతంగా లాక్కుని కొడితే యేం చేస్తారు ?"

నిర్మలకీ ధోరణి నచ్చలేదు. ఈమె తనను తాను సమర్థించుకోవాలని వచ్చింది.... అంతే.... నిర్మల నవ్వుతూ అంది "ఏం చేస్తాను ? గద్దిస్తాను — ఆ వస్తువును తమ్ముడికిప్పిస్తాను — ఇంకా మొండి చేస్తే నాలు గంటిస్తాను"

"నేనుగూడ అదే చేస్తాను...మీకు నాకు ఒకటే భేదం. మీరు కన్నతల్లి—నేను సవతితల్లిని— నాకు పెళ్ళికాకముందు పిల్లలిద్దరు ఈయనదగ్గర యే అండలేకుండా పెరిగారు. వారిని క్రమపద్ధతిలో పెంచినవారు లేరు. ఏ గమ్యంలేకుండా తిరుగుతున్న బొంగరాల్లావున్నారు. చిన్నవాడు ఫరవాలేదు. కానీ పెద్దవాడు తుంటరిగా తయారయ్యాడు. ఇంత చిన్నవయస్సులో మనం ఊహించలేని దురలవాట్లు అలవర్చుకున్నాడు. పెళ్ళయి వచ్చిన రెండవరోజు నూతిగట్టుమీద కూచుని బీడీ త్రాగుతున్నాడు. నాకు ఒళ్ళు జలదరించింది. పిల్లల నోకపద్ధతిలో ఉంచి క్రమశిక్షణ యివ్వకపోతే యెంతగా చెడిపో తారో! వసంత్ కొక్కాయి—దగ్గుతో నానా అవస్థ పడుతున్నాడు.. అక్కయ్యా! ఆ క్షణంలోనే ఒక నిర్ధారణకు వచ్చాను. వీళ్ళిద్దరికీ తల్లిలేని లోటు తీర్చి ఒక దారికి తేవాలని. ఐతే అల్లరివాడు—బెత్తం పుచ్చుకుని నయాన భయాన సన్మార్గ వర్తనుడిగా లేతమొక్క మనంకోరిన విధంగా వంగేట్లు—వాడు వెంటనే యీ నూతన జీవితవిధానాని కలవాటుపడి మామూలు పిల్లవాడయ్యాడు. తెల్లవారి కాఫీ త్రాగి బడికని వెళ్ళేవాడు. అంతే. యెక్కడెక్కడో ఆడి, అలసిపోయి దుమ్ముకొట్టుకున్న జుట్టుతో వచ్చేవాడు. ఒకరోజులో తేలిపోయింది— వెళ్ళింది బడికి కాదని—పుస్తకంలో యేముందో తెలియదు. వాళ్ళనాన్నగారికిదేమీ పట్టలేదు. నీ యిష్టం అనే వారు. అక్కయ్యా ! ఒకవేళ వాళ్ళిద్దరి విషయం, అసలు పట్టించుకోకుండా దూరంగానే వుంచిన వారి పూచీ నాకెందుకు బాబూ, అనుకుని నాదారి నేను పోయివుంటే— పిల్లల్ని క్రమశిక్షలో పెంచ లేదు; వారు చెడిపోతుంటే చూస్తూ ఊరుకుంది. కన్న బిడ్డల్ని అలా చూచేదా? అని యిలాంటి అభాండాలు నా నెత్తిన వేస్తారుకదా? సరే—వారి బాధ్యతను స్వీకరించి, కన్నబిడ్డలుగా భావించి మంచి శిక్షణనివ్వాలని పూనుకుని నా శాయశక్తులా ప్రయ త్నించి ప్రవర్తిస్తే నా కొచ్చిన పేరు యీ విధంగా ఉంది. నేను పిల్లలను హింసించే రాక్షసిని గానీ, పిల్లలు రాక్షసులుగా వున్నారని తెలియదు."

శ్యామల ఆపింది. నిర్మలవైపు తదేకంగా చూస్తోంది. నిర్మల మాట్లాడే శక్తిలో లేదు. ఇంకా యేంచెప్పబోతోంది ? నిజంగా పిల్లలంత అధ్వాన్నంగా వున్నారా? అంతటి దుష్ప్రవర్తనుడుగా వున్నాడా ఆమెభర్త ? నిర్మల పడుకునేఉంది. చెం పకు చేయఆన్చి వింటోంది.

శ్యామల కన్నీరు కారుస్తోంది. ఆ వేడికన్నీటి బొట్టు టప్న చేతిమీద పడింది. నిర్మల గబు క్కున తలెత్తి చూచింది.

"ఏడుస్తున్నావేమమ్మా ?" అంది— అందులో హోదార్పులేదు — ఆప్యాయతలేదు. మామూలు గానే అంది.

శ్యామల కన్నీళ్ళు తుడుచుకుంది. చిన్నగా నిట్టూర్చి అంది "మీ గురించి మీ మరదిగారెంతో చెప్పారు. మీరంటే నా కెంతో పూజ్యభావం. నా హృదయంలోని బాధను మీకు నివేదించి కొంత వరకు ఉపశమనం పొందాలని ఉంది. మీరు పరాయి వారైనా నాకెంతో సన్నిహితులైనట్లు భావిస్తున్నాను. శ్రమ అనుకోకుండా నా కథను వినండి—అప్పుడైనా నాపై సానుభూతి చూపగలరు..

# బంగారు పంజరం

"తప్పకుండా చెప్పమ్మా — నేను నీకు ఆ విధంగానైన సాయపడగల్గితే అంతకన్నా నేను కోరే దేముంది ?"

"అమ్మ నాకు జ్ఞాపకంలేదు— నాకు ఏడాది దాటకముందే పోయింది. నాన్న మళ్ళీ పెళ్ళిచేసుకున్నారు. లోకం సవతితల్లిని ఒక రాక్షసిగా సృష్టించింది. అందు కాధారాలు లేకపోలేదు. నాకు జ్ఞానం తెలిసినప్పటినుంచి కష్టాలే అనుభవించాను. మా మారుతల్లి యీ యిరవై సంవత్సరాలలో ఒక్కసారైన నన్ను దయగా పలుకరించి ఆదరించలేదు ఆమెకు నేనంటే గిట్టదు. తన సుఖాలకు, విలాసాలకు, అన్నింటికి నేను అటంకమని తలంచింది. ఆమె సరళమైన బాటలో నేనొక ముళ్ళకంపను కాలికి గుచ్చుకున్న ముల్లు ఆమెను ఇరవై సంవత్సరాలు బాధించినట్లు భావించింది. నాపై యేదో కసి, ద్వేషం, అసహ్యం ...ఆమెకు సంతానం కల్గలేదు. అలాంటివారికి పరాయిపిల్లలను చూస్తే యెంతో యిష్టంగా వుంటుంది. కనీసం వాళ్ళను చూచి ఆనందిస్తారు. కానీ పిన్నికి తన స్వంతబిడ్డలు లేకపోయినా నన్ను ఆదరించిందికాదు. ఆమె సంతాన విహీన అవటం నాదే తప్పయినట్లు సాధించేది. స్త్రీలో ఉండవలసిన కరుణ, ప్రేమ, జాలి, మాతృత్వం ఆమెలో లేవు. ఆమె హృదయం కఠిన శిల. మాటలు విషపూరితాలు. తలంపులు దుష్టతలంపులు — చేతలు అమానుష్యమైనవి ఆమె దృష్టిలో నేను స్త్రీని కాను.

అక్కయ్యా — నాపై ఆమెద్వేషం పరిపక్వమై యిలా నడిచిందంటే నన్ను రెండవ సంబంధానికి యే ఆస్తిపాస్తులులేక నిరాధారుడైనవారి కిచ్చేందుకు స్థిరపడింది. ఆమె మాటను జవదాటని నాన్న యీ విషయంలోమాత్రం యెంతో ప్రొద్దేయపడి — ఒప్పుకోనని ఖచ్చితంగా చెప్పారు. తనకున్న డబ్బు, పొలంఅంతా నాదే కాబట్టి మంచి సంబంధం చూచి చేయాలని పట్టుబట్టారు. పిన్ని మాత్రం ఆ మూడుముళ్ళూ వీరితోనే వేయించాలని కంకణం కట్టుకుంది.

"పుట్టిన యింట్లో సుఖంలేదు, కనీసం మెట్టినిల్లైన బావుండాలని భగవంతుని ప్రార్థించుకునేదాన్ని. అక్కా! మనుషుల్లో క్రూరులున్నట్లే మానవుల్లో దేవతలున్నారంటే నమ్మటం కష్టం— కానీ— నాహృదయనిశిలో ఆశాజ్యోతి వెలిగించింది మా మామయ్య. అంటే నా కన్నతల్లి తమ్ముడు కాదు. అతనైతే ఆశ్చర్యపడవలసినదేమీలేదు. కానీ అతను మా పిన్ని అన్నయ్య. పిన్ని అతని కేం చెప్పిందో ! బహుశః బావతో చెప్పి ఈ సంబంధాన్నే నిశ్చయించమని నూరిపోసిందికాబోలు. ఆ మాటలు మామయ్య చెవుల్లో దూరాయి కానీ, మా మామయ్య తలంపులు వేరుగాఉండిన్నై. పిన్ని వినకుండా నా దగ్గర కొచ్చి — ఈ సంబంధం రెండోదైనా, పిల్లలున్నా, యేమీ లేనివాడైనా ఫరవాలేదు—నీవు యితన్ని చేసుకుంటే సుఖపడ్తావు తల్లీ—అతనంటే బాగా నాకు తెలుసు, బుద్ధిమంతుడు పిన్నికి తోడై నీ జీవితాన్ని నాశనం చేయదలచి ఈ సలహా యిస్తున్నానని తలంచకు తల్లీ. నీమీద నాకు ప్రత్యేకాదరాభిమానా లున్నాయి

అతను యెంతో మంచివాడు. ఇదంతా నా కెలా తెలుసంటావేమో ? మా అత్తయ్య పుట్టినిల్లు కూడ వేట్లపాలెమే. ఆమెకు అబ్బాయినిగూర్చి క్షుణ్ణంగా తెలుసు." మామయ్యమనసు నాకు తెలుసు. నా జీవితంలో వివాహానికి ముందు యెక్కడైన స్వేచ్ఛగా సంతోషంగా కాలం గడిపానా అంటే, అది మామయ్యగారింట్లోనే. అప్పుడప్పుడు పిన్ని నన్ను పంపించేది. మామయ్య, అత్తయ్య పరాయివారైనా, వారింట్లో నాకు స్వర్గసౌఖ్యం లభించినట్లుండేది

"మామయ్య కుట్టించిన మంచిమంచి పరికిణీలు, రవికెలు వేసుకోనిచ్చేదికాదు. పైగా నన్ను చెడిపేస్తున్నాడని. మామయ్యమీదికి తోక త్రొక్కిన నాగులా లేచేది మామయ్య లెక్కచేసే వాడు కాదులే. ఇంతా చేస్తే మామయ్య వున్నవాడు కాడు. అతికష్టంతో సంసారాన్ని నెట్టుకొస్తూ అతిసామాన్య కుటుంబీకుడు; అయితే మాత్రం యేమక్కాయ్ — ఆ పులుసు, అన్నం, పిల్లలతో కలిసి మెలసి వుండటమే చాలు అనిపించేది. యమయాతనలు అనుభవిస్తూ తినే పరమాన్నంకంటే యిదే వేయిరెట్లు నయం అనుకునేదాన్ని.

మామయ్యపై నా కెంతో గౌరవం. విశ్వాసం ఉంది. పూజ్యులైనవారి మాటను తిరస్కరించక తలొగ్గాను. అక్కయ్యా ! మామయ్య ఆశీర్వబలం అనుకుంటా, నా వైవాహిక జీవితం సుఖమయమైంది. మామయ్య అన్నట్లు నాకు స్త్రీ వాంఛించే సర్వసుఖాలు వున్నాయి"

నిర్మల లేచికూచుంది. ఏదో అనబోయింది. కానీ శ్యామల గబుక్కునఅంది "అంతేకాదక్కాయ్ ఇంకా నేపాగు — నన్నంతా చెప్పనీయ్. అత్తలు కోడళ్ళను రాచి రంపానబెడితే, కోడళ్ళు కఠిన హృదయులై, వారత్తలయ్యాక తమ కోడళ్ళను హింసిస్తుంటారుకదా ? కానీ నా విషయంలో అలా జరగలేదు. సవతితల్లిచేతిలో నే పడ్డకష్టాలు, నాకు తల్లిలేని బిడ్డలను సానుభూతితో ప్రేమతో చూచే దృష్టిని ప్రసాదించినై. అనుకోని విధంగా నే నొకరికి సవతితల్లి నయ్యాను. ఆ పిల్లలజీవితంలో వెలుగు నింపి మానవులుగా చేసి నా ధర్మాన్ని నిర్వహించాలని ఆ నాడే బాసచేసుకున్నాను.

"ఆర్థికంగా మా పరిస్థితి చక్కబడింది. నాన్న హఠాత్తుగాపోయారు. నే ననుకుంటాను: మామయ్య ప్రోత్సాహంవల్ల నాకు చెందవలసిన పొలం, యిల్లు నాన్న నాకు రాసేశారు. పిన్నికి సరిపడేంత ఆమె కిచ్చారు. ఆ పొలం మామయ్యే చూస్తారు"

శ్యామల కంఠం రుద్ధమైంది. ఉన్నట్లుండి యేడ్చింది. నిర్మల కేం చేయాలో పాలుపోలేదు. దీనంగా చూస్తూ శ్యామల అదురుతున్న భుజాలను పట్టుకుని "ఊరుకోమ్మా" అంటోంది.

శ్యామల వెక్కిళ్ళు అణిగినై. నిర్మల తొడమీద తలఆన్చి బొంగురుపోయిన కంఠంతో అంది "అక్కయ్యా— ఈ మనఃక్షోభను భరించలేను... పెళ్ళయిన అయిదు మాసాలకు తల్లిని కాబోతున్నానని తెలుసుకున్నాను. ..నాలోని ఆనందం సంపూర్ణత చెందబోతోందని ఉవ్విళ్ళూరి యెన్నో కలలుకన్నాను. ఆ స్వప్నాన్ని— నిజంగానే స్వప్నంచేసినట్లు నాకు ఏడునెలలప్పుడు, గర్భంపోయింది ... అనుకున్నది జరుగలేదు ."

శ్యామల తిరిగి యేడవటం మొదలెట్టింది. ఆమె దుఃఖం కట్టలు త్రెంచుకుంది. ఆ దుఃఖంలోనే కసిగా మాటలను నొక్కి పల్కుతూ అంది "నా కోర్కె ఫలించదు.... యిది జరక్కముందేవారు ఆపరేషన్ చేయించుకున్నారు"

నిర్మల స్తంభించిపోయింది. తెరిచిన పెదాల్లోంచి "ఆ" అనే ఆశ్చర్యార్థకం భయంకరంగా విన్పించింది. ఆమె నరనాడులు ముళ్ళపడిన్నై. శ్యామల చెప్పిందంతా ఆమె హృదయాన్ని కదిలించివేసింది.

శ్యామల గబుక్కున లేచి కూచుంది. చెంబులోని నీళ్ళు ముఖంమీద జల్లుకుంది "ఇంత భీరువు నయిపోయా నెందుకో అక్కయ్యా— మిమ్మల్ని బాధిస్తూ మీచేత కంటతడిపెట్టిస్తున్నాను . ఎందుకా ! నా కిద్దరు బిడ్డలున్నారు— వారిదేం తప్పులేదు. ముగ్గురు చాలనుకున్నారు — భగవంతుని చిత్తం యీ విధంగాఉంటే మన తలంపులెలా నెరవేరుతాయి ?... ఇప్పుడు చెప్పండి వాళ్ళిద్దర్ని కూడా మానుంచి వేరుచేస్తారా ? వారు నా పిల్లలని భావించండి. . వారి విషయమై ఏ విధమైన చింత, దిగులు పెట్టుకోకండి . పిల్లల్ని పంపమనే హక్కు వారి నాన్నగారికుంది గానీ . మా పరిస్థితి నర్థంచేసుకొని నన్ను ఒక భయంకరమైన సవతితల్లిగా తలంచకండి అని చెప్పటానికే వచ్చాను. అంతేకాదు. నాకు సంఘటిల్లిన 'ఈ సంఘటనను అర్థంచేసుకుని సానుభూతి చూపగల్గే సహృదయం వదినెకుంది—నువ్వు వెళ్ళు— ఆమెతో చెప్పు— వసంత పిల్లల విషయం భయపడి వదినెకు బాధ్యత అప్పగించింది. అమె 'నేనేమి చేయలేక పోయానే, వసంత ఆత్మకు శాంతికల్గించలేక పోయానే' అని బాధపడ్తుంది— అని వారు మరీ చెప్పిపంపారు"

నిర్మల శ్యామలవైపు చూచింది మందస్మితయైన శ్యామలను కౌగిలించుకుని "నాకిప్పుడు శాంతి లభించింది" అంది

తెల్లవారగనే మొదటి బస్సులో వెళ్ళిపోవాలని శ్యామల అంది కానీ వాళ్ళెవరు ఒప్పుకోలేదు. అందరి బలవంతంపై ఉండక తప్పిందికాదు.

మూడురోజులున్నారు. నాలుగవరోజున వాళ్ళను తీసుకెళ్ళటానికి శ్యామలభర్త వచ్చాడు. మునుపున్న మనస్పర్థలు పోయినై. అల్లుడిని యెంతో ప్రేమతో ఆదరించారు. సాయంత్రం ప్రయాణంస్థిరపడింది.

బండి వాకిట్లో ఆగివుంది. కమలమ్మ శ్యామలకు చీర, రవికె, పసుపుకుంకుమ యిచ్చి అల్లుడితో అంది "ఇది యిప్పటికీ మీ అత్తవారిల్లనుకోండి— ఏమమ్మా శ్యామలా పుట్టింటి మమకారంపోదు. ఇదే మీయిల్లనుకో — తరచు వస్తూ పోతూఉండండి"

శ్యామల "అలాగే అమ్మా" అంది

ఆ పిలుపు ఆమెహృదయాంతర్భాగంలోంచివచ్చింది.

"ఎందుకత్తయ్యా— వాళ్ళ మామగారింటికెళ్ళి అన్ని ముడుపులు తెచ్చుకుంటుందిగా ? మీ దగ్గర కొచ్చి మళ్ళీనా ? బావుంది— బావుంది. .. రెండు వాటాలన్నమాట" అంటూ నవ్వేశాడు

"బావుంది కేమయ్యా— మా పిల్ల వస్తుంటే తీసుకెళ్తుంది—మధ్యలో నీ కెందుకంత యీర్ష్య" అన్నారు ప్రసాద్‌గారు అందరూ నవ్వారు

వెంకటగిరి నేతచీర కట్టుకుని, అక్కడక్కడ నెరసిన వెంట్రుకలు జారుముడివేసికొని మల్లెమొగ్గల మాలను కురుల్లో తురిమి, శ్యామలవైపు ఆప్యాయంగా చూస్తూ సెలవుతీసుకుంటున్న నిర్మలకు శ్యామల—భర్త భక్తితో నమస్కరించి "వెళ్ళొస్తాము వదినగారూ" అన్నాడు. నిర్మల చిరునవ్వుతో వారిని గేటుదాక సాగనంపింది. (సశేషం)

రంటే జాలిగానే ఉంటుంది మరి."

నాకై నే నేమీ మాట్లాడలేదు. కాఫీ ముగిసిన తర్వాత ఆఫీసుకి వచ్చాము. మేము వస్తూండగా మళ్లీ ఆవిడ మాకు ఎదురు పడింది. అందమైన మనిషి!

నేను నా స్థానంలో కూర్చున్న తర్వాత మధుసూదనం మళ్లీ పిలిచాడు. చిరాకుతో అతని స్థానం సీటు దగ్గరికి వెళ్లాను.

"సారీ బ్రదర్ .... నీ కో ఉత్తరం వచ్చి చాలా రోజులయింది. అది నీకు అందజేద్దా మనుకునే యిప్పటివరకూ వాయిదా వేశాను. ఇదిం."

అతను ఇచ్చిన ఉత్తరం తీసుకు వచ్చేశాను. నా స్థానంలో కూర్చుని ఉత్తరం విప్పాను:

శ్రీ రావుగార్కి,

నాన్నగార్కి ఓ పది రోజుల నుండీ గుండెల్లో విపరీతమైన పోటు వస్తున్నది. ఈ కారణం చేతనే మే మెవ్వరమూ మీ పెళ్లికి రాలేకపోయాము.

ముందు ఈ విషయాన్ని మీకు తెలియజేయ వద్దన్నారు. కాని—యివ్వాళ గుండె నొప్పి ఉధృత మయింది. మీకు ఉత్తరం రాయమని స్వయంగా ఆయన చెప్పడంలో రాస్తున్నాను. మీ పెళ్లి పను లన్నీ సక్రమంగా ముగిసిన తర్వాత వీలు చేసుకుని ఒకసారి రావలసిందిగా నాన్న మిమ్మల్ని ఆహ్వానిస్తున్నారు.

చివరిసారిగా మిమ్మల్ని చూడాలని ఉందిట.

మీ, నిరంజనం—

ఉలిక్కిపడ్డాను. ఆ చివరి వాక్యం నా నవనాడు లన్నీ కృంగదీసింది. ఆయన శరీర స్థితి ఎలా ఉంది? ఇంతకు మునుపు వచ్చిన ఉత్తరాల్లో ఏనాడూ ఆయన ఈవిధంగా రాయలేదు. ఉత్తరం చదువుతూన్న ప్రతి మాటూ ఆందోళన ఉధృత మవుతోంది. ఆ చివరి వాక్యాన్ని పదే పదే చదువు కుంటూ అర్థాన్ని నాకు తోచిన విధంగా సమన్వ యించుకోడం తప్ప — మనసుని కుదుట పరచుకోలేక పోతున్నాను.

ఉత్తరాన్ని తీసుకుని ఆఫీసరు గదిలోకి వెళ్లాను. నా ఆదుర్దాని గమనించి, నన్ను చూడగానే అడిగా రాయన:

"సెలవు కావాలా?"

అవునన్నాను ఆశ్చర్యపోతూ ....

"పెళ్లయిన తర్వాత మనిషికి బాధ్యతలు పెరుగు తాయిట. సరే మీరిక వెళ్లచ్చు"

సెలవు మంజూరు చేసినందుకు ధన్యవాదాలు చెప్పి వచ్చేశాను. రెండు రోజుల సెలవు రాసి హెడ్ గుమాస్తా చేతి కిచ్చాను. సెలవు కాగితాన్ని తీసు కుంటూ నవ్వుకున్నా రాయన.

* * *

ఆ సాయంత్రం పెందరాడే గది కొచ్చాను.

తలుపుతీసి రెండు జతల బట్టలు సూటు కేసులో సర్దుకుంటూండగా రుక్మిణమ్మగారు వచ్చారు. గుమ్మం దగ్గరే నిలబడి—

"నీకు కొత్త కళ వచ్చేసింది సుమా! తాతయ్య గారు నిన్ననే ఊరు వెళ్లారు. ఆయన నిన్ను చూడాలని తహతహలాడుతున్నారు" అన్నది నవ్వుతూ.

నా ముందే ఆవిడ అలా మాటాడుతూంటే సిగ్గు

# ఎందుకు?

21 వ పేజీ తరువాయి

వేట్టుకొచ్చింది! తల వంచుకున్నాను.

"తల దించుకుంటా వెందుకోయ్ పెళ్లి కొడుకా? మరీ ఆడపిల్లలా అంత సిగ్గయితే ఎలా నాయనా .... తలెత్తు .... అన్నట్టు .... మీ ఆవిడ నెప్పుడు తీసుకొస్తావూ?"

"నా కా విషయాలు తెలీవండి."

"ఈ ఇంట్లోనే మరో భాగం నీకు యిద్దామ కాని, నీ కది చాలదేమో ననుకుంటున్నాను."

"అప్పుడే ఈ విషయా లెందుకులెండి?"

"బలేవాడివేలే .... సంసారమంటే బొమ్మలాట అనుకున్నావా నాయినా? అందులో కొత్త సంసారం కూడాను. అన్నీ అందుబాటులో ఉండాలి. ఏ లోటూ రాకుండా చూసుకోవాలి. అప్పుడే సుఖం. ఉండు .... ఒక్క నిముషం .... ఇప్పుడే వస్తాను" అంటూ ఆవిడ వెళ్లారు.

రుక్మిణమ్మగార్కి ఏభై సంవత్సరాలు దాటాయి. ఆవిడకు పిల్లలు లేరు. వాళ్లింట్లో అద్దెకుంటూన్న మమ్మల్నే తన పిల్లలుగా చూసు

"అవును సరళా మీ రిద్దరూ పెళ్ళి చేసుకుందామనుకున్నా ఎందుకు పెళ్ళి ఆగిపోయింది?" శ్యామల అడిగింది. "అన్నీ సిద్ధమైపోయాయి. ఎవరి జీతం ఎవరికి ఎవరు ఇవ్వాలీ అన్నదే తేలలేదు." సరళ చెప్పింది.

కుంటున్నారంటే ఆశ్చర్యంలేదు. అన్నివిధాలా మాకే చేదోడు వాదోడుగా ఉంటున్నా రా దంపతులు!

నాతోపాటు మరో ముగ్గురు మిత్రులు ఈ గదిలో ఉంటున్నారు. నలుగురం కలిసి చదువు కున్నాం. అదృష్టవశాత్తు నలుగురికీ యిక్కడే ఉద్యోగాలు కావటం మూలంగా అందరం ఒకే గదిలో ఉంటున్నాం. మామధ్య ఏనాడూ పొరపొచ్చాలు రాలేదు. అందరం కూడా ఒకే మాటమీద నిల బడి ఉంటున్నాం ఇంతవరకూ. మేమంటే గిట్టని చాలామంది మా స్నేహాన్ని చూసి యీర్ష్యపడటం కూడా కద్దు. ఈ స్నేహాన్ని చెడగొట్టాలని ప్రయ త్నాలు కూడా జరిగాయి, కాని—వాళ్లకి అలాంటి అవకాశాన్ని ఇవ్వలేదు.

మరో అరగంటలో రైలుంది. ఈ రైలె క్కితే యీ రాత్రికే చేరుకోవచ్చు. కానీ, ఊరు వచ్చి కూడా మిత్రులకి కనుపించకుండానే వెళ్లి పోవడం బాధగా ఉన్నా— వెళ్లక తప్పడంలేదు.

రుక్మిణమ్మగారు నాకోసం రెండు లడ్డూలు తెచ్చారు. అవి నా చేతి కిస్తూ .....

"ఇవి పుచ్చుకో బాబూ .... నీ జీవితంలో ఎందేళ్లూ ఇంత తాపీగానే గడవాలని ఆశిస్తూ న్నాను" అన్నా రావిడ.

కృతజ్ఞతా పూర్వకంగా ఆవిడకు నమస్క రించాను. ఆవిడ కళ్లల్లో లీలగా కన్నీరు తొణికిస లాడింది.

"మిమ్మల్ని చూస్తోంటే ఏదో వాత్సల్యం పుట్టు కొస్తూంటుంది. ఇది చూచి నవ్వుతారు. నాదంతా పిచ్చని అంటారు. నీకు తెలీదు గాని ఆయనక్కూడా పిల్లలంటే విపరీతమైన మోజు."

నవ్వి ఊరుకున్నాను. ఆవిడ నా పక్కనున్న సూటు కేసు చూచి అడిగారు:

"ఏదైనా ఊరు....."

"అవునండి, అత్యవసరంగా రాజమండ్రి వెళ్లాల్సివచ్చింది. ఈ విషయం మావాళ్లకి చెప్పండి. మళ్లా రెండు రోజుల్లో వచ్చేస్తానని చెప్పండి."

"అలాగే .... "

ఆవిడ దగ్గర సెలవు తీసుకుని స్టేషనుకు వెళ్లాను. ప్లాటుఫారంమీద రైలు సిద్ధంగా ఉంది. టిక్కట్టు తీసుకుని రైలెక్కాను.

రైలు కదిలింది!

—మేము స్థితిపరులం కాదు. నాన్న సంపాద నలో చాలా భాగం అక్కయ్యల పెళ్లిళ్లకే ఖర్చయింది. తాతగారు నాన్న కిచ్చిన అయిదెకరాల మాగాణి, మా స్థిరాస్తి. పోలినా దానిమీద వచ్చే అదాయం, నాన్న జీతం—ఈ రెంటితో మా సంసారం ఏ వడి దుడుకూ లేకుండా సాగింది. అక్కయ్యలకు వాళ్ల అదృష్టంకొద్దీ మంచి సంబంధాలే దొరికాయి. పండుగలకూ, పబ్బాలకూ వాళ్లంతా వస్తే, ఉన్న దాంట్లోనే సంతృప్తిపరచేవారు నాన్న.

నాన్నకి అభిమానం జాస్తి. ఏ విషయంలోనూ ఆయన ఒకళ్లని ఆశ్రయించటమంటే తల తీసి నంతగా బాధపడేవారు. ఉన్నదే స్వర్గ మనుకునే వారు నాన్న.

నేను బి. కాం. పాసయ్యి సంవత్సరంపాటు ఖాళీగా ఉన్నా, ఆయన కించిత్తయినా చలించ లేదు. ఆయనకున్న పరపతి నాకు ఉద్యోగం క్షణంలో వేయించగలదు. కాని—దీనిద్వారా అవతలి వాళ్లకి చులకనవటం ఆయనకు యిష్టంలేదు.

"నీ అర్హత గమనించి నీకు ఉద్యోగం ఇవ్వగలిగిన వాడే యిస్తాడు. లేదూ—ఉన్న ఆ కొద్ది భూమినీ సాగు చేసుకుందువుగానీ."

ఎప్పుడు నా ఉద్యోగం ప్రసక్తి వచ్చినా—ఆయన ఈ రెండు ముక్కలూ చెప్పి ఊరుకునేవాళ్లు. చదువుకుని ఉద్యోగం చేద్దామనుకుని దృష్టినంతా చదువుమీదనే లగ్నం చేసినవాళ్లకి మళ్లీ సేద్యం చెయ్యాలంటే తలకు మించిన పని. ఈ విష యాన్ని కూడా ఆయన పట్టించుకోలేదు.

నిరుద్యోగిగా ఒక సంవత్సరంపాటు అతి కష్టంగా గడిచింది నాకు. ఒక్క ప్రయత్నం కూడా సమ కూడి రాలేదు.

సరిగ్గా అలాంటి సమయంలోనే 'ఆయన' తో నాకు పరిచయం కలిగింది. మా పరిచయం ఎలా జరిగిందో తలచుకుంటూంటే యిప్పటికీ చిత్రంగా ఉంటుంది నాకు.

మాఊరు విశాలమైన మైదానాలకు ప్రసి ద్ధని, బందరు తెలిసిన చాలామంది చెప్పుకుం టారు. ప్రకృతిసిద్ధమైన ఈ మైదానాల ముందు

కృత్రిమమైన ఉద్యానవనా లెందుకూ పనికిరావంటే సత్యదూరం కాదు ! ప్రతిరోజు సాయంత్రాలు ఆ మైదానాల్లో కూర్చునేందుకు చాలామంది వస్తూండేవారు.

అక్కడికి వచ్చి, నే కూర్చున్న తరువాత ఓ పది నిముషాలకు 'ఆయన' వస్తూండేవారు. నా ముందు నుంచే వెళ్ళి, నాకు పది అడుగుల దూరంలో ఎత్తుగా పెరిగిన పచ్చిగడ్డిపైన కూర్చుండేవారు. నా ముందు ఆయన చాలా చిత్రమైన మనిషి

కూర్చున్న క్షణం నుంచీ ఆకాశంవైపూ, చుట్టు ప్రక్కల స్థలాల వైపూ—మా ముందున్న తారు—రోడ్డు వైపు ఆత్రంగా చూచేవారు. అలా ఓ అర గంటపాటు గడిపి వెళ్ళిపోయేవారు.

ప్రతిరోజూ ఆయన తప్పకుండా హాజరయ్యే వారు. అదే చోటులో కూర్చునేవారు ! అలాగే చూస్తూండేవారు

ఒకటి రెండు రోజులు ఆయన ఏ కారణం చేతనైనా రాకపోతే—ఆరోజు నా కసలేమీ తోచేది కాదు. రోజూకంటె పావుగంట ముందే యింటికి వెళ్ళిపోయేవాడిని. ఆయన కూడా ఇంతేనేమో !

అలాంటిది ఆయన వారంరోజులపాటు రాక పోయేసరికి పిచ్చెత్తినట్టయింది. ఎప్పటికప్పుడు ఈరోజైనా ఆయనొస్తే బావుండే దనిపించింది. వచ్చేవారు కాదు. అక్కడికీ ఒక పావుగంటా, అర గంటా కేవలం ఆయనకోసం ఎదురుచూస్తూ గడిపేవాడిని

పది రోజులు గడిచినా ఆయన నాకు కనపించ లేదు

ఏదో పోగొట్టుకున్నట్టనిపించేది అంతా వెలి తిగా కనిపించేది

ఆయన నెవరు ? నే నెవర్ని ? ఆయన నాకు కని పించకపోతే మునిగిపోయేదేమి టసలు ?—నాకు

# ఎందుకు ?

నేనె కొత్తగా కనుపిస్తున్నాను.

ఒకరోజు నే నక్కడ కూర్చుని ఉండగా ఒక అపరిచిత వ్యక్తి నా దగ్గరకు వచ్చాడు. నన్ను చూస్తూ . .

"మీరేనా బాబూ .... రోజూ యిక్కడ కూకుం డేది ?"

"ఏం .... ఏం కావాలి ?"

"మిమ్మల్ని అయ్యగారు యెంటబెట్టుకు రమ్మన్నారు."

"ఎవరు మీ అయ్యగారు ?"

"అయ్యగారు కూడా యీడనే కూకుండేవారు. అయ్యగార్కి ఒంట్లో బాగోలేదు మిమ్మ ల్నెంటబెట్టుకు రమ్మన్నారు."

ఆయనే ! .... ఆయనే నన్ను పిలిపించారు. ఆశ్చర్య మనిపించింది వచ్చినతన్ని మౌనంగా వెంబడించాను.

అతను ఆ దగ్గర్లో ఉన్న ఓ డాబా యింట్లోకి తీసుకెళ్ళాడు. ఇల్లు అందంగా అలంకరింపబడి ఉంది చుట్టూ ప్రహరీ—అందమైన క్రోటన్సు —వీధి గుమ్మానికి చక్కటి డిజైనుతో ఉన్న తెర.

వరండాలో నాలుగు పేము కుర్చీలూ, వాటిమధ్య టీపాయ్

నా వెంట వచ్చిన వ్యక్తి లోపలికెళ్ళి, మళ్ళీ వచ్చి అన్నాడు:

"రండి అయ్యగారు రమ్మంటున్నారు."

లోపలి కెళ్ళాను ఆయన పడక — కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్నారు. ఈ పది రోజుల్లోనూ ఆయన బాగా చిక్కిపోయినట్టు కనుపిస్తున్నారు. నన్ను నవ్వుతూ ఆదరంగా ఆహ్వానించారు. కూర్చునేందుకు కుర్చీ చూపించారు. నే కూర్చున్న తర్వాత అన్నారు:

"నా పేరు సీతారామయ్య—"

ఆయన మంచి హోదాలో ఉన్న అధికారిట. రాజమండ్రీ నుండి యిక్కడికి మొన్ననే బదిలీ అయిందిట. ఈ ఊరి పరిసరాలు యింకా కొత్తగా కనిపిస్తున్నాయిట. కాని—యిక్కడి వాతావరణం తనలాటి జబ్బు మనుష్యులకి మంచిదిట. ఇలా ఎన్నో విషయాలు చెప్పి చివరిన అన్నారు—

"రత్నాల్లాటి పిల్లలూ, ఆస్తీ, హోదా అన్నీ ఉన్నాయి నాయనా. కాని—నా ఆరోగ్యం రోజు రోజుకీ అధ్వాన్నంగా తయారవుతోంది. ఈ దిగులే నన్ను కృంగదీస్తోంది. అలా రెండు మూడు ఫర్లాంగులు ప్రతిరోజూ నడవమని డాక్టరు సలహా ఇచ్చాడు. అతని మాటలను తూ. చ. తప్పకుండా పాటిస్తున్నాను. నిన్ను రోజూ చూస్తున్నాను. తెలీకుండానే నీతో పరిచయం చేసుకున్నంత పనయింది. ఈ పది రోజులూ ఎక్కిన మంచం దిగలేదు. చిరాకూ, విసుగూ కలిగాయి నువ్వు అక్కడికి వచ్చిఉంటావని భావించి, నాతో కాసేపు మాట్లాడ తావనే ఉద్దేశ్యంతో నీకు కబురంపాను"

నా పేరూ, వివరాలూ వగైరా అడిగారు. అన్నింటికీ జవాబు చెప్పాను.

"మా అబ్బాయి నిరంజనం రాజమండ్రీలో హాస్టల్లో ఉండే చదువుకుంటున్నాడు నా బదిలీతో వాడి చదువు చెడిపోవడం నా కిష్టంలేదు. పెద్దమ్మాయి రాధ, అత్తవారింట్లో ఉంటున్నది. ఇకపోతే నేనూ, మా ఆవిడా, రెండో అమ్మాయి కుసుమా యిక్కడ ఉంటున్నాం"

ఇది చెప్పిన తర్వాత రెండు క్షణాలు ఆగి, మళ్ళా నవ్వుతూ అన్నారు—

"కబుర్లు చెప్పుకునేందుకు ఎవ్వరూ నేస్తం దొరకలేదు ఆఫీసులోవాళ్ళు ఇంటికొచ్చి కబుర్లు చెప్తారనే నమ్మకం నాకు లేదు. వాళ్ళకి కావలసింది ఆఫీసులో రగులుతున్న రాజకీయాలూ, నా మెప్పుకో లూనూ. అందుచేతనే నిన్ను వెదుక్కున్నాను నీతో స్నేహం చెయ్యాలని నిశ్చయించుకున్నాను."

ఆరోజు ఆయనే ఎక్కువసేపు మాట్లాడారు. అది లగాయితూ ప్రతిరోజూ ఆయన్ను కలుసు కునేవాడిని. పెద్దవారు, లోకానుభవం ఉన్నవారు కాబట్టి తరచూ ఆయన వక్త, నేను శ్రోతనూ. ఆయన ప్రతి విషయాన్నీ కూలంకషంగా పరిశోధించినట్టు చెప్పేవారు. ఆయన భావాలు తెలుసు కోడం మాత్రం నా వంతయ్యేది.

ఒకోసారి మైదానాల్లోనూ, మరోసారి వారి ఇంట్లోనూ, తప్పనిసరైతే పోస్టాఫీసులో వాళ్ళ ఆఫీసులో కూడా మా సమావేశం జరిగేది.

నన్ను ఇద్దరు ముగ్గురు స్నేహితులు అన్నారు కూడాను—

"నీకేమిటోయ్ అధికారిని జేబులో పెట్టు కున్నావ్. నువ్వు నోరు తెరుచుకు అడిగితే గాని నీకు ఉద్యోగం వాళ్ళ ఆఫీసులో క్షణాలమీద రాదూ —" అని

కాని ఆయన మనస్తత్వం వాళ్ళకు తెలీదు— ఆయన అంత త్వరగా 'మనిషి' ని నమ్మరు. ఒక



సారి కుసుమ పెళ్లి విషయమై ఆయన నాతో ఇలా అన్నారు—

"కుసుమ దురదృష్టవశాత్తు పక్షవాతానికి గురై చేయి పోగొట్టుకుంది. ఈ అంగవైకల్యం కుసుమ రూపాన్ని సైతం కించపరుస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఆ పిల్లకి త్వరగా పెళ్లవుతుందని నే ననుకోను. ఒకవేళ పెళ్లయినా ఆ పెళ్లిలో సుఖ పడుతుందంటే నాకు నమ్మకం చాలడంలేదు. కుసుమకి చాలా మంచి సంబంధాలే వచ్చాయి. కాని — వాళ్లని చూస్తుంటే కేవలం నా డబ్బూ, నా హోదా మీదనే ప్రేమున్నట్టు కనిపిస్తుంది కాని, నా పిల్లమీద ప్రేమున్నట్టు కనుపించడం లేదు. అందుచేతనే వచ్చిన ప్రతి సంబంధాన్నీ నేనే వెడగొట్టేస్తున్నాను. పిచ్చిపిల్ల — ఈ చర్యకి ఎంత తల్లడిల్లిపోతుందో [illegible] !"

అందుకే అంటాను — ఆయన ఎవర్నీ అంత త్వరగా నమ్మలేరని. ఇలాంటి పరిస్థితుల్లో నాకు మీ ఆఫీసులో ఉద్యోగం వేయించండని అడిగితే నన్నేవిధంగా భావిస్తారో కదా — కేవలం ఉద్యోగం కోసరమే నేను ఆయన స్నేహాన్ని వాంఛిస్తున్నా నని ఆయన అనుకుంటే, అంతకంటె ఘోరం మరొకటిలేదు. అలాంటి అవాంఛనీయమైన పరిస్థితి రాకూడదనే భగవంతుణ్ణి ప్రార్థిస్తాను.

కాని — పరిచయస్థులు మా స్నేహానికి విపరీతార్థాలు తీస్తూనే ఉన్నారు. కాటికి కాళ్లుచాపి చావు కోసం ఎదురుచూస్తోన్న పెద్దమనిషితో రెండు పదులు నిండిన యువకుడికి స్నేహ మేమిటి వల్ల కాడూ, ఈ స్నేహం వెనుక 'స్వార్థం' తప్పకుండా ఉండిఉంటుందని నా మొహం ఎదటనే అనేవారు. విని బాధపడేవాడిని. అంతే గాని ఆయన స్నేహం నుంచి తప్పుకోడం నా చేతకాదు.

ఒకసారి—లోగడ వచ్చినట్లే ఆయనకు గుండె నొప్పి వచ్చింది. ఈమాటు ఉధృతంగా వచ్చింది. మా యిద్దరిమధ్యా ఉన్న అనుబంధం ఆయనకు నాచేత సపర్యలు చేయించింది. రెండు రోజులపాటు కుసుమా, నేనూ ఆయన మంచాన్ని అంటిపెట్టుకుని కూర్చున్నాం. ఆయన స్థితి బాగుపడ్డ తర్వాత కళ్లను నీటితో నింపుకుని నన్నుద్దేశించి అన్నారు— 'నువ్వు దేవుడివి నాయనా !' అని.

సీతారామయ్యగారి పరిచయస్థులతో నన్ను తనకు ప్రాణం ఇచ్చే మిత్రుడినిగా పరిచయం చేశారు. ఆయన మిత్రులు కళ్లింతవి చేసుకుని అర్థంకానట్టు ఆయనవైపు చూశారు. వాళ్లలా చూస్తుంటే నాకు సిగ్గనిపించింది కూడా.

—ఇంటర్వ్యూల నిమిత్తం హైదరాబాద్ వెళ్లడం అది మూడోసారి. నాన్నని అడిగాను. 'నీ యిష్టం. పైకం కావలిస్తే మీ అమ్మ నడుగు' అని చెప్పి ఆయన ఆఫీసుకు వెళ్లిపోయాడు. ఏమైనా సరే ఈ ఇంటర్వ్యూతో అటు ఉద్యోగమో, ఇటు సేద్యమో తేల్చుకోవాలని నిర్ణయించుకుని అమ్మని డబ్బడిగి తీసుకొని హైదరాబాద్ వెళ్లాను.

ఉద్యోగం గగనకుసుమమైంది. వచ్చిన ఏభై మంది అభ్యర్థుల్లోనూ ముగ్గుర్నే అర్హులుగా పరిగణించింది. ఆ ముగ్గురికే ఉద్యోగాలు యిచ్చారు. మరొక అనుభవాన్ని గడించి యింటికి వచ్చాను.

సీతారామయ్యగారు ఆ మూడు రోజులనుండి ఎందుకు కనిపించలేదని అడిగారు. నా హైద్రాబాదు ప్రయాణమూ, దాని ఫలితమూ వివరించి చెప్పాను. రెండు నిమిషాలు ఆయనేదో ఆలోచించి నన్ను అడిగారు:

"ఇంకా ఇలా నిరుద్యోగిగా ఎన్నాళ్లుండ దలిచావు ?"

"అది మన చేతుల్లో ఉన్నదాండి ?"

"పిచ్చివాడా ! ప్రయత్నాలు చెయ్యాలే కాని, మనిషి సాధించలేని విషయమంటూ ఏదీ లేదు. రేపు ఒక అప్లికేషను రాసి నా చేతికివ్వు. మా ఆఫీసు లోనే ప్రయత్నిస్తాను. చూద్దాం. నా చేతనయినంత వరకూ నేను ప్రయత్నిస్తాను. సరే."

నేనేమీ మాటాడలేదు.

ఆ తర్వాత రోజుకూడా అప్లికేషను గురించి అడిగారు. నా ఉద్యోగ ప్రయత్నం ఆయన చేతుల మీదుగా జరగడం నా కిష్టంలేదు. అయినా, ఆయన బలవంతంమీద అప్లికేషను రాసివ్వక తప్పిందికాదు.

నెలరోజులు తిరక్కుండానే నాకు బెజవాడ బ్రాంచిలో ఉద్యోగం వచ్చింది. సీతారామయ్య గారికి నా ధన్యవాదాలు చెప్పుకున్నాను. ఆయన నా భుజాన్ని తట్టుతూ అన్నారు:

ఏమయ్యా! యీ రోడ్డుమీద పది సంవత్సరాలుగా కారు డ్రైవ్ చేస్తున్నా నన్నావ్? యివాళ నా కారు నెందుకు గుద్దేశావ్. తన కారు గుద్దేశిన పెద్దమనిషిని సుబ్బారావు అడిగాడు. "ఈ పదేళ్ళూ ఎన్నడూ నీ కారు యీ రోడ్డుమీద లేదు."

బాలాజీ సైన్పూర్

"చక్కగా ఉద్యోగం చేసుకో. పైకి రావడానికి ప్రయత్నాలు చెయ్యి. ఏది ఏమైనా మన స్నేహాన్ని మాత్రం మరచిపోకు."

ఆయన సహృదయత్వం, స్నేహంమీద ఆయనకు గల గౌరవభావం నన్ను ముగ్ధుణ్ణి చేశాయి.

జీవితంలో నన్నొక ఉద్యోగిగా స్థిరపరచింది. సీతారామయ్యగారు. ఆయన చేసిన ఈ మహోపకారాన్ని మరో జన్మలో కూడా మరిచిపోలేను.

బెజవాడ వెళ్లిన తర్వాత ఉత్తరాలు రాస్తుండే వాడిని. ఆయన సమాధానాలు వ్రాస్తుండేవారు. ఆయన రిటైరవడం, రాజమండ్రిలో స్థిర నివాస మేర్పరచుకోవడం అన్నీ ఈ ఆరు నెలల్లో జరిగాయి.

నా పెళ్లికి వారం రోజుల ముందు ఆయనకు ఓ ఉత్తరం రాశాను; తప్పకుండా రావలసిందిగా ఆహ్వానిస్తూ. దాని కాయన చాల చక్కటి సమాధానం రాశారు. నేను ఓ యింటివాడి నవుతున్నా నని తెలిసి ఆయన ఆనందిస్తున్నారట. పెళ్లికి తప్పకుండా వస్తున్నట్టు రాశారు. పెళ్లయిన తర్వాత వీలుంటే నా భార్యను వెంటబెట్టుకుని రావలసిందిగా ఆహ్వానించారు.

* * *

సీతారామయ్య గారింట్లో ఇంకా దీపం వెలుగుతూనే ఉంది. రిక్షా దిగాను. నిరంజనం ఆ యింటి ముందు నిలబడి ఉన్నాడు. అతన్ని చూడగానే ఏదో కీడు శంకించాను. "నాన్నగారు కులాసా ?" అని అడిగాను. అతను ముఖాన్ని దించేసుకుని గబగబా యింట్లోకి వెళ్లిపోయాడు.

అతని వాలకం నన్ను కలవర పరచింది. ఇంట్లో అడుగు పెట్టగానే పార్వతమ్మగారూ, కుసుమా, రాధా ఏడ్వడం మొదలుపెట్టారు.

అలాగే అక్కడే ఉన్న కుర్చీలో కూలబడి పోయాను.

నిరంజనం నా దగ్గరకు వచ్చి అన్నాడు—

"ఆయన పోయేముందు మీ గురించి అడిగారు—" అతను పసిపిల్లాడిలా వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

ఆ మాటతో నా తల దిమ్మెత్తిపోయింది. చేతుల్తో తలను గట్టిగా పట్టుకున్నాను. సీతారామయ్యగారి రూపం నా యెదుట తచ్చాడుతూనే ఉంది.

* * *

గోదావరి గంభీరంగా ఉంది.

చాలా దూరం నడిచి వచ్చాను. ఎన్నో స్మృతులు, ఆయన వ్యక్తిత్వం, మా స్నేహం, గడిచిన రోజులు యివన్నీ నన్ను కలవర పెడుతున్నాయి.

ఆయన యిక లేరు ! ఆ స్నేహం ఇక తిరిగి రాదు.

నిరంజనం ఇంకా చదువుకునే కుర్రాడు, కుసుమకి పెళ్లి కాలేదు, వ్యవహార దక్షత తెలిసిన యింటిపెద్ద లేనప్పుడు ఆ కుటుంబం ఎన్ని అవస్థలు పడాలో కదా ?

ఆయ నొకసారి నాతో అన్నారు—

"నిరంజనం చదువుపూర్తయి, నాలుగు రాళ్ళూ సంపాయిస్తూ—కుసుమ పెళ్లయి తన సంసారాన్ని చక్కగా దిద్దుకుంటూంటే నాకే దిగులూ ఉండదు రావ్ ! వచ్చే చావు అప్పటివరకూ వాయిదా వేసుకుంటే ఎంతో బావుణ్ణు !"

ఇది గుర్తుకు రాగానే, నాకు తెలీకుండానే ఏడుపొచ్చింది. హాయిగా బ్రతకటానికి నాకు అవకాశం కల్పించిన వ్యక్తికి నే నేవిధంగానూ సాయం చెయ్యలేకపోయాను. ఈ ఋణ విముక్తి ఈ జన్మకి లేదేమొ !

చీకటిపడుతుండగా ఇంటిముఖం పట్టాను. మళ్లీ ఉదయమే వెళ్లిపోవటానికి నిశ్చయించుకున్నాను. దిగులుతో నిండిన ఆ ఇంట్లో ఇంకా నేనుండలేను అనుక్షణమూ ఆయన గుర్తుకొస్తూ నావల్లనయ్యే కార్యం ఒక్కటీ లేకపోగా, నా చేతకానితనం నన్ను వేధిస్తూ .... వద్దు .... నాకీ నరకం వద్దు.

ఆ ఇంటిముందు ఓ కారు ఆగిఉంది. ఇంటో ఎవరిదో మగ గొంతు వినిపిస్తోంది. మెల్లిగా నా గ్గది లోకి వెళ్లాను. గదిలో కుసుమ కూర్చుని ఉన్నది

# ఎందుకు?

నన్ను చూడగానే లేచి నిలబడింది.

"ఇంతసేపూ ఎక్కడికి వెళ్లి వచ్చారు ? ఉండండి. కాఫీ తెస్తాను" కుసుమ వెళ్లిపోయింది.

పక్క గదిలోనుండి మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి—

"అయితే నువ్వు రానట్టేగా ?"

"నన్ను బలవంతం చెయ్యకండి. ఇంతలో రాను."

"నీ కేం తక్కువ చేశానని ?"

"నా నోటితో చెప్పదలుచుకోలేదు. అంతా మీకు తెలుసు."

"మంచిది .... నీ కెప్పుడు యిష్టమైతే అప్పుడే రా .... నిన్ను బాధపెట్టను. వస్తా .. ."

నా గది గుమ్మం దగ్గర నిలబడి ఆ వ్యక్తిని చూచాను. ఆశ్చర్యం ..... మా ఆఫీసరు ! .... నన్ను నేనే నమ్మలేకపోయాను.

కారు బయలుదేరిన శబ్దం విని రాధ గదినుండి బయటికి వచ్చి వరాండాలో నిలబడింది. అయిదు నిముషాలపాటు అక్కడే నిలబడి మళ్లీ తన గదిలోకి వెళ్లిపోయింది. వెళ్లేముందు నావైపు చూచి తల దించుకున్నది.

"మా బావ వచ్చారు అక్కయ్యని తీసుకెళ్లేందుకు. కాని ఆయన పద్ధతి అసహ్యంగా తయారయింది. హోదాకు తగ్గ గుణం బావలో లేదు." కాఫీ యిస్తూ కుసుమ చెప్పింది.

"ఎవరికీ తలొంచడం చేతగాని ఆఫీసరు ఈవిడకి దాసోహ మంటున్నారు. ఈవిడ స్నేహంవల్ల సర్వవిధాలా చెడిపోటానికి సిద్ధపడుతున్నారు" మధుసూదనం మాటలు గుర్తుకొచ్చాయి.

"బావ ఈ హోదాకి చేరుకోవడంలో నాన్న కొంత సహాయం చేశారు. ఆ విశ్వాసం కూడా మరిచిపోయాడు బావ." కుసుమ కూర్చుంటూ అన్నది.

రెండు క్షణాల తర్వాత మళ్లీ ఆమే మాట్లాడింది.

"మీ పెళ్లి రెండురోజు లుందనగా నాన్నగారు పోయారు. మీకు ఏ విషయమూ రాయవద్దని అంతకుముసుపే చెప్పారు. ఇక్కడి విషయాలతో మీ మనసు పాడవుతుందని ఆయ నుద్దేశ్యం."

"నాకు తెలుసు ఆయన దైవస్వరూపులు."

"పోయేముందు అమ్మ కో మాట చెప్పారాయన."

"ఏమని ?"

".... .... .... ..."

"చెప్పండి."

"ఈ ఇంట్లో నిరంజనానికి ఎలాంటి స్థానముందో మీకూ అదే స్థాన ముంటుందని అన్నారు' కుసుమ తన ముఖాన్ని చేతుల్లో దాచుకుంది.

మౌనంగా ఉండిపోయాం. కాసేపటికి ఆమె వెళ్లిపోయింది.

—రాత్రి భోజనాలైన తర్వాత నా గదిలోకి వచ్చేస్తుండగా, రాధ నన్ను పిలిచారు ఆవిడ గదిలోకి వెళ్లాను.

"అలా కూర్చోండి. మీకు ఒక ముఖ్య విషయం చెప్పాలని ఉంది."

"చెప్పండి." అన్నాను కూర్చుంటూ.

"ఏ విషయమైనా సరే కుండ బద్దలు కొట్టినట్లు, మనసులో ఉన్నది ఎదటివారికి చెప్పడం మంచిదంటాను. మీరేమంటారు.?"

"నిజమే .... "

"మావారి దగ్గర నేను ఇదే పద్ధతి ఆచరించాను. ఆయన మానసికంగా బలహీనులు. అది నాకు నచ్చదు. తను చేస్తున్నది తప్పని తెలిసి కూడా కప్పిపుచ్చుకోటానికి ప్రయత్నం చేస్తారు. అందుకే ఆయనకూ, నాకూ సరిపడదు. ఇదంతా చెప్పి విసిగించటం నా కిష్టంలేదు. ఈమధ్య నాన్నగారి డైరీ తీసి చదివాను. ఒకవిధంగా ఆయనగారి తత్వం గూడా నాకు రుచించలేదు. ఈ పేజీలో ఆయన రాసిన అభిప్రాయం నన్ను ఆశ్చర్య పరిచింది. ఈ విషయం మా ఇంట్లో కూడా ఎందుకు చెప్పకుండా దాచుకున్నారో అర్థం కావటంలేదు. ఇది చదవండి" ఆ పేజీ తెరిచి డైరీ నా చేతి కిచ్చింది. చదివాను:

'రావ్ పెళ్లట. అతను పెళ్లి చేసుకుంటున్నాడం సంతోషంగా ఉంది కాని—కుసుమకి అతను తగిన వరుడని ఒక నిష్ఫయానికి ఇంతకుముసుపే వచ్చాను ఈ మాట అతనితో చెప్పటానికి నా మన సెందుకో తటపటాయించింది. రవ్ యోగ్యుడు. అతణ్ణి అల్లుడిగా చేసుకుని ఈ యింటి కాధారం చేసుకుందా మనుకున్న నాకు గట్టి దెబ్బే తగిలిందని చెప్పాలి.'

అదిరిపడ్డాను. రాధ సూటిగా నా కళ్లల్లోకి చూచింది.

"చదివారా ?"

"ఊ .... "

"నాన్న గురించి మీరేమనుకుంటున్నారు"

"విధి చాలా చిత్రాలు చేస్తుందని తెలుసుకున్నాను."

"పొరపాటుని 'విధి' కి అంటగట్టడం భావ్యంగా లేదు. ఆయన మిమ్మల్ని అల్లుడిగా స్వీకరించా లనుకున్నప్పుడు, ఆమాట మీతో అనిఉండాల్సింది. అలా జరగలేదు. ఆయన ఇంత త్వరగా పోవటానికి కారణం—"

"రాధగారూ—" గట్టిగా అరిచాను.

"ఇంక నా కే పాపమూ అంటగట్టకండి ప్లీజ్. ఆయన చేసిన సహాయానికి బదు లెలా చెప్పుకోవాలో తెలీని పరిస్థితుల్లో ఉన్నాను. అది చాలక నా మూలంగానే ఆయన .. వద్దు మీ రలాంటి నింద నా నెత్తిన పెట్టకండి" ఒక్క ఉదుటున ఆ గదినుండి బయటకు వచ్చేశాను.

ఆవిడ మెల్లిగా అన్నది.

"మీ వ్యక్తిత్వాన్ని కించపరచాలనే భావం నా కెన్నడూ లేదు. నాన్నగారి అతి మంచితనాన్ని గౌరవించటం తప్ప మరొకటి తెలీని మనం ఆయన్ని కించపరచలేం !"

తర్వాత మాటలు నాకు వినిపించలేదు—కాదు—వినదలుచుకోలేదు. ★

---

# రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

యాత్రకంటే, మనతోనే ఉంటూ, మన వెన్ను పొడిచే విద్రోహులవలనే, యెక్కువ నష్టముంది" ధైర్యంగానూ, ఆవేదనగాను అన్నాడు.

చుట్టూ చేరిన నలుగురూ తలలూపారు అటూ యిటూ చూసి, స్నేహితునితోసహా, చకచక నిష్క్రమించాడు; ఆయనకేం భయమేసిందో యేమో మరి !

ఓ వ్యక్తి, నన్ను రెండుమూడుసార్లు పరీక్షగా చూసి, దగ్గరగా వచ్చాడు. 'ఎంత ట్రూత్ అయినా, బహిరంగంగా యిట్లా చెప్పటం మంచిదికాదండీ' అన్నాడు గంభీరంగా.

అట్లా చెప్పాలిసిందేనండీ, ఇక్కడున్నవాళ్లల్లో, అలాంటివాళ్లెవరైనా ఉంటే వాళ్లకు బుద్ధొస్తుంది ! ...ఎగిరి గంతేశాడు, ప్రక్కనుంచి ఓవ్యక్తి.

నాతో మాట్లాడదామనుకుని వచ్చిన వ్యక్తి ఉక్కిరిబిక్కిరయ్యాడు. పాపం, యేమీ మాట్లాడలేదు. ఉన్నట్టే ఉండి, ఇట్టే తప్పుకున్నాడు.

'అసలు నన్నడుగుతే, దేశవిద్రోహులను ముందర అరెస్ట్‌చేసి పారెయ్యాలి. గవర్నమెంటైనా సరే సరిగ్గా ఏక్ట్ చెయ్యలేకపోతే, డిస్‌మిస్ చెయ్యాల్సిందే" ఉద్రిక్తుడయ్యాడు.

"ఇప్పుడు మనమంతా కలిసి, గవర్నమెంటును సపోర్ట్ చెయ్యాలండీ. మనలో మనం దెబ్బలాడుకునే సమయంకాదండీ యిదీ" అన్నాను, ఆయన్ని శాంతపరుద్దామని. ఇంకా చెలరేగిపోయాడు.

'ప్రభుత్వాన్ని సపోర్ట్ చెయ్యటానికేమి అభ్యంతరంలేదు; ఈ క్లిష్టసమయంలో, మనమంతా ఒక్కమనిషిలాగా నిలబడి, దురాక్రమణ దారుల్ని తరిమికొట్టాల్సిందే ! ఈ దేశం, ఓ పార్టీసొత్తు కాదు. ఓ వ్యక్తి ఆస్తికాదు. అందరికీ చెందింది. మనందరం, దీని రక్షణకు కృషి చెయ్యాల్సిందే ! ఈ ఆపద సమయంలో, ప్రభుత్వం వేస్తున్న ప్రతి ఒక్క అడుగును, శల్యపరీక్ష చేసి, తప్పొప్పులను, నిర్భయంగా చెప్పాలిసిన, బాధ్యత, ప్రతి ఒక్కని మీదా ఉంది. దీన్ని విస్మరిస్తే, దేశానికి ద్రోహం చేసినట్టే !" ఆవేశంలోకి వచ్చేశాడు.

ఆయన దేశభక్తి, ఆవేదన, ఆందోళన పూర్తిగా అర్థంచేసుకున్నా, సరుకున్నవాడులాగానే కనిపించాడు. అతనుకూడా నారాయణగూడా వెళ్లాలని తెలుసుకుని 'ఇరవై నిముషాలయింది, యింతవరకు మళ్లీ బస్సులేదు. ఇట్లాగేవెళుతూ మాట్లాడుకుందాం' రండి అన్నాను. పాపం ఆయన సరే అంటూ వెంట వచ్చాడు. రక్తం ఉడికిపోతోంది. మన జవాన్లు నిష్కారణంగా చచ్చిపోతున్నారండీ అన్నాడు గద్గదికంగా. ఇంకా మేము సుల్తాన్‌బజారుగుండా చౌరాస్తా నన్నా, దాటలేదు. ఏడునెంబరు 'బి' 'సి' బస్సులు కలిసిమెలిసి, ఒదానివెంట ఒకటి వరసగా, మమ్మల్ని చలాకీగా దాటేసినాయి, పెళ్లివారి ఊరేగింపు బస్సుల్లాగ ★

# విశాలనేత్రాలు

11 వ పేజీ తరువాయి

నిరంతరపాటి. ఆ మనోహరం[ద కంఠధ్వని ఆ నాడంతే వాసు లెవ్వరికి వినబడలేదు! అది వారందరికీ ఎంతో విద్యుద్ఘాతంగా స్ఫురించింది. వారి ఎరుకలో ఆచార్యు లెన్నడు తన దైనందిన నియమక్రమం రవంతయినా అతిక్రమించలేదు! 'నేడు వారికేమయినా కొంచెం అస్వస్థత కలిగినదేమో!' అని మొట్టమొదట వారిలో వారు కొంచెం సమాధానపడ్డారు.

మరికొంతసేపటికి దాశరథి ఎంతో ఆత్రతతో యజ్ఞమూర్తిని సమీపించి 'ఆచార్యు లెక్కడ కనబడడంలేదు! వా రెక్కడికి వెళ్లారు?' అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నతో యజ్ఞమూర్తికి మతిపోయినట్టయింది! వారిద్దరు కలిసి మఠంలో, పూల తోటలో నలుమూలల గాలించారు! ఎక్కడ ఆచార్యుని జాడ కనబడలేదు! ఎక్కడికి బయలుదేరినా దాశరథిని గాని, యజ్ఞమూర్తిని గాని వెంటబెట్టుకొని వెళ్లేవా డాయన! ఎందుచేతనో గాని ఈ నాడది జరగలేదు!

కాంచీపూర్ణుడు, శ్రీశైలపూర్ణుడు, గోష్ఠీపూర్ణుడు వరరంగాచార్యుడు, మాలాధరుడు పురాతన శ్రీవైష్ణవధర్మసంప్రదాయ ప్రవర్తకుడు యామునాచార్యుని ప్రియాంతేవాసులు. వారయిదుగురు రామానుజునికి పరమాచార్యులై శ్రీవైష్ణవధర్మరహస్యాలుపదేశించారు. వారిలో వర రంగాచార్యుడు మాత్రమే ఇటీవల కొంతకాలంనించి శ్రీరంగంలో నివసిస్తున్నాడు రామానుజయతి అప్పుడప్పుడు ఆ భక్తాగ్రణిని సందర్శించి ద్రావిడ ప్రబంధ పాశురాల పరమ రహస్యాలవగాహన చేసుకుంటూ ఉండడం ఒక పరిపాటి. ఆచార్యు లొకవేళ అక్కడికి వెళ్ళిఉండవచ్చునని అనుమానించి యజ్ఞమూర్తి అనంతసూరిని అక్కడికి పంపించాడు. కాని, ఆయన కనబడలేదు. అప్పుడే అరుణోదయం అయింది. రామానుజు లొకవేళ శ్రీ రంగనాథ దేవాలయానికి గాని, కావేరీ స్నానానికి గాని, వెళ్ళి ఉండవచ్చునని దాశరథి కొక ఊహతట్టింది. గోవిందయతి, కూరాగ్రహారాధిపతి వేర్వేరుగా ఆ ప్రదేశాలవైపు వెళ్ళి నలుమూలల గాలించి తిరిగి వచ్చారు. కాని ఆచార్యు లెక్కడ కనబడలేదు! గోవిందయతి, అనంతసూరి మొదలయిన ప్రధాన శిష్యులప్పటికి మఠం విడిచిపెట్టి ఆయన ఎక్కడికయినా వెళ్ళిపోయి ఉండవచ్చునని భయపడ్డారు. యజ్ఞమూర్తికి, దాశరథికి క్రమక్రమంగా అదే అభిప్రాయం కలిగింది. ఇటీవల రామానుజుని ప్రగాఢ నిరంతర మౌనముద్ర దానికొక గట్టి తార్కాణగా స్ఫురించింది.

మరికొంతసేపలాగ గుంజాటనపడిన తరవాత ఆచార్యు లొకవేళ ధనుర్దాసు భవంతికి వెళ్లారేమో అన్నాడు యజ్ఞమూర్తి. సన్యాసాశ్రమం స్వీకరించిన తరవాత ఆచార్యుడెన్నడు పని కట్టుకుని ఒకరి ఇంట అడుగుపెట్టలేదని వారికి తెలియకపోలేదు. అయినా లోలోపల పీడిస్తున్న అనుమానంతో వా రుభయులు ధనుర్దాసు భవంతికి బయలుదేరారు. ఆచార్యుల కొకవేళ తన ఎడల రవంత వైమనస్యం కలిగినదేమో అని యజ్ఞమూర్తి మార్గమధ్యంలో పరిపరి విధాల మథనపడ్డాడు. ధనుర్దాసు భవంతి ఆవరణద్వారం దాటి లోపల అడుగుపెట్టగానే యజ్ఞమూర్తి, దాశరథి మరి తమ కన్నులే నమ్మలేక నిలువునా నిర్ఘాంతపడ్డారు!

హేమాంబా ధనుర్దాసు లిద్దరు ఆచార్యునివంటి మహనీయ వ్యక్తి తమ ఇంట అడుగుపెట్టగలరని కలలోనయినా ఊహించిఉండలేదు! అందుచేత వారిద్దరు మాటిమాటికి తొందర తొందరగా అటు ఇటు తిరుగుతూ ఎంతో అడకువతో అడుగులకు మడుగు లొగ్గుతున్నారు. పైడిపూలతో నలువైపుల అలంకరించిన ఒకపీటమీద ఆయన విశ్రమించిన తరవాత వారిద్దరు చేతులు కట్టుకొని నిలుచున్నారు. ఆచార్యుని అనురోధంవల్ల ఎట్టకేలకు వట్టి నేలమీద చతికిలబడ్డారు. అలాగలాగ అయిదారు నిమిషాలు గడిచిన తరవాత రామానుజులు వారిద్దరికి స్వయంగా అష్టాక్షరీమంత్రం ప్రసాదించబోతున్నారని యజ్ఞమూర్తి, దాశరథి గ్రహించడాని కెంతోసేపు పట్టలేదు.

ఆ సంఘటన అంతే వాసులకు ఎంతయినా ఆశ్చర్యం కలిగించింది! ఇటీవల రామానుజు లెవ్వరికి స్వయంగా అష్టాక్షరీ మంత్రోపదేశం ప్రసాదించలేదు. ఇంచుమించుగా ఆయనతో సమాన వయస్కుడయిన గోవిందయతి ముఖతః మాత్రమే కొంద రా మంత్రోపదేశం స్వీకరించారు. ఇది మఠాధిపతి యజ్ఞమూర్తి గోవిందయతిని ప్రార్థించి తానై చేసిన ఏర్పాటు. దానికి కొన్ని కారణా లున్నాయి. ఎవ్వరికయినా అష్టాక్షరీ మంత్రం ఉపదేశించినప్పుడు ఆ నాడంతా ఉపవసించడం ఆచార్యుని కొక పరిపాటి ఆయన వృద్ధుడయినందువల్ల అంతటి శ్రమ కలిగించడం భావ్యం కాదన్న ఆలోచనతోనే మఠాధిపతి ఆ నూతన పద్ధతి ప్రారంభించాడు. అంతకుమునుపే దానికి రామానుజుని మౌనాంగీకారముద్ర లభించింది. అటువంటప్పుడు అకస్మాత్తుగా హేమాంబా ధనుర్దాసులవంటివారికి ఆచార్యులు స్వయంగా మంత్రం ప్రసాదించడాని కేమి కారణము? ఇటీవల సదాచారపరులయిన నిష్ఠాపరులెందరో రామానుజుని ముఖతః ఆ మంత్రం స్వీకరించవలెనని అభిలషించారు. కాని, ఆచార్యునికి అది ఎంతో శ్రమ కాగలదన్న ఆలోచనతో యజ్ఞమూర్తి వారి ప్రార్థన కనుమతించలేదు! ఎన్నో విధాల బతిమాలుకొని గోవిందయతి ముఖతః అది స్వీకరించవలసిందని వేడుకొన్నాడు. ఆచార్యులే ఆ యతీశ్వరుని కటువంటి అపూర్వాధికారం ప్రసాదించినప్పుడు ప్రత్యేకించి ఆ వృద్ధమూర్తిని శ్రమపెట్టటం భావ్యం కాదని చెప్పి, వారందరిని ఒప్పించాడు. గోవిందయతి యెడల ఏర్పడిన అపార గౌరవంవల్ల క్రమక్రమంగా ఆ నిష్ఠాపరులందరు ఆ పద్ధతి కంగీకరించారు. ఆనాటి కానాటి కది ఒక పరిపాటిగా పరిణమించింది.

అటువంటప్పుడు ఆచార్యుడు స్వయంగా ధనుర్దాసువంటి సామాన్య వ్యక్తి ఇంట అడుగుపెట్టి, పని కట్టుకుని స్వయంగా మంత్రోపదేశం ప్రసాదించడానికిగల కారణమేమో ఎంతగా ఆలోచించినా వారి కవగాహన కాలేదు. ఏది ఏమయినా తా మిక ఆ విధంగా నిలబడి ఉండడం మర్యాదకాదన్న తలపోతతో వారిద్దరు ఆ భవంతి వీధిఅరుగుమీద పరచిన ఒక తుంగ చాపమీద కూర్చున్నారు. మధ్యలో

లక్షలాది జనులకు ఆనందం కలిగించే ఆంధ్ర సచిత్ర వారపత్రికలో
ప్రకటనలు వేసి మీ వ్యాపారాభివృద్ధి చేసుకొనండి.

# విశాల నేత్రాలు

లోపలికి వెళ్లడం సముచితంకాదని మంత్రోప దేశ సమాప్తికోసం ప్రతిక్షణము నిరీక్షించారు. ఆ సమయంలో ధనుర్దాసు కంఠస్వరం వారిద్దరికి విస్పష్టంగా వినిపించింది. అప్పటి కతనికి ఆచార్యులు తమ కిద్దరికి అష్టాక్షరి యథావిధిగా ఉపదేశించి బోతున్నారన్న నిశ్చయం కలిగింది కాబోలు! తాను దానికి పూర్తిగా అనర్హుడనని విన్నవించుకొంటున్నాడు. స్వకీయ పంకిల చరిత్ర అంతా ఆమూలాగ్రంగా స్వల్పాతి స్వల్పమయిన చిన్న సంఘటన కూడా విడిచి పెట్టకుండా విస్పష్టంగా వెల్లడించుకొన్నాడు. ఇంతకుమునుపు కొన్ని అసత్యాలు చెప్పి, మభ్యపెట్టినందుకు కృపార్ద్ర దృష్టితో క్షమించవలసినదని తిరిగి దోసిలికట్టి ప్రాధేయపడ్డాడు. ఆతని ముఖతః వెలువడిన ఆ యథార్థ వృత్తాంతం యావత్తు వినగానే వారిద్దరికి ఎంతో ఆశ్చర్యం వేసింది. హేమసుందరి ఎంత అడకువతో తలవంచుకొని కూర్చున్నది. అత డలాగే గుక్క తిప్పుకోకుండా తన గోడు వెళ్లడించుకొంటున్నాడు. పూజ్యులయిన సజ్జనులకేగాని తనవంటి పాపికంతటి అర్హత ఆఎంలయినా లేదని తిరిగి డగ్గుత్తికతో మొర పెట్టుకొన్నాడు తమకది ఉపదేశించవలదని పాదాల మీదవాలి ప్రాధేయపడ్డాడు.

వారిద్దరు ఆ తరుణంలో వీధివైపునఉన్న గవాక్షంలోనించి ఆచార్యుని ముఖవైఖరి పరిశీలించారు. అలరినవ్వు మాత్రమే గోచరించింది. ఆచార్యు డాతనిని వెల్లివిరిసిన వాత్సల్యంతో లేవనెత్తి చల్లని పలుకులతో సమాశ్వాసించాడు:

'నాయనా! సత్పురుషు లెప్పటికయినా పరమేశ్వర సాన్నిధ్యం చేరుకొంటారు. వారి మార్గం సుగమమే! ఇక మిగిలినవారికోసమే ప్రత్యేకించి స్వామి శ్రీరంగంలో అవతరించారు! ఎందుకు నీకింత ఆరాటం?'

అయినా రంగనాయకు డా మంత్రం స్వీకరించడాని కంగీకరించలేదు. తనవంటి మహా పాతకి మరి లోకంలో ఇంకెక్కడ ఉండడని తిరిగి విన్నవించుకొన్నాడు. అయినా ఆచార్యుని పెదవులపై ప్రసన్న దరహాసితం మాత్రమే తరళించింది:

'పుణ్యాత్ములు మాత్రమే తామెంతో పాపాత్ములమని అనుకుంటారు! మిగిలిన వారందరు తమవంటి సత్పురుషు లెక్కడ ఉండరని అహంకరిస్తారు! తాము చేసినవి ఒప్పులే అని సమర్థించుకొంటారు. సరె దీనికేమిగాని, ఈ మంత్రానికి పెద్ద నియమనిష్ఠ లేవిలేవు! తోచినప్పు డెప్పుడయినా కొంచెం మనస్సులో జపించుకొంటే చాలు. క్రమక్రమంగా లదే చేయి పట్టుకొని స్వామి సమక్షానికి తోడుకొని పోగలదు!'

ఆవిధంగా ధైర్యం చెప్పిన తరవాత రంగనాయకుని కిక అంగీకరించక తప్పలేదు. హేమసుందరి కుపదేశించిన పిమ్మట మంత్రం యథావిధిగా స్వీకరించాడు. మున్ముందుగా తన యెడల ఆచార్యుల కంతటి అనుగ్రహం కలిగినందుకు ఆమె లోలోపల ఎంతో సంతోషించింది. వా రిద్దరు తిరిగి ఆచార్యునికి సాష్టాంగ నమస్కారా లర్పించి అతివినీతులై చేతులు కట్టుకుని నిలుచున్నారు. ఆచార్యుడు ఆ

# విశాల నేత్రాలు

దంపతుల శిరస్సు లల్లన స్పృశించి ఆర్ద్రకంఠంతో ఆశీర్వదించాడు. మంత్రోపదేశం ముగిసినదని గ్రహించిన యజ్ఞమూర్తి, దాశరథి అదే క్షణంలో లోపల ప్రవేశించారు. రంగనాయకు డింతవరకు వారిద్దరు తన భవంతి అరుగుమీద కూర్చున్నట్టు గుర్తించలేదు. ఆ శిష్యుల నిద్దరిని చూడగానే ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో సవినయంగా నమస్కరించి యథోచితంగా గౌరవించాడు. రామానుజయతి లేత నవ్వుతో తరలిస్తున్న పెదవులతో అంతేవాసుల నమస్కారాలందుకొని హేమసుందరీ రంగనాయకుల నిద్దరిని వీడ్కొన్నాడు. దాశరథి భుజం అవలంబనంగా స్వీకరించి అల్ల నల్లన శ్రీ రంగ దేవాలయంవైపు సాగిపోయాడు. అంతేగాని మఠంవైపు మరలలేదు! యజ్ఞమూర్తి అది గమనించి లోలోపల ఇనుమడించిన మథనతో వారి ననుసరించాడు.

అప్పటి కించుమించుగా అరజాము పొద్దెక్కింది. వీధులలో ఇరువైపుల ఒత్తుగా పెరిగిన పసిర పచ్చికలమీద నిలిచిన మంచు బిందువులు పుష్యమాస శుభోదయ కాంతితో పైడి ముత్యాలవలె ప్రకాశించాయి. గాలిలో తేలిపోతున్న ధూళి కూడా దేవకాంచనాం పుప్పొడివలె తరళించింది. ఆ సువర్ణ సూర్యోదయ వేళలో దివ్య మనోహర కాంతివాహిని వరదవెల్లువలతో నేల నాలుగువైపుల ఒక్కమారుగా ముంచెత్తుతున్నట్టు గోచరించింది! దుఃఖితుల వెలుగెత్తి సమాశ్వాసిస్తున్నట్టు శ్రీరంగ దేవాలయ ఘంటాధ్వని అల్లంతదూరంలో మాటి మాటికి మారుమ్రోగింది. బాటలలో చలి మంటలనుండి వెలువడిన సన్నని ధూమరేఖల బారులు అలసాలస పంచనాలతో పొగమంచు తెరలతో మేళవిస్తున్నాయి. దేవాలయ మార్గంలో నీరెండలో హిమవర్షంలో చలిమంటలచుట్టు జేరిన బాల బాలికల ముఖాలుమాత్రం విస్పష్టంగా గోచరించాయి. క్రమ క్రమంగా పౌరులనేకులు స్వామి సందర్శనార్థమై దేవళంవైపు సాగిపోతున్నారు.

రామానుజయతి శిష్యులతోబాటు రంగనాథస్వామిని సందర్శించి తీర్థ ప్రసాదాలందుకొని గర్భాలయాని కనతిదూరంలోఉన్న విశాల కళ్యాణ మంటపంలో విశ్రమించాడు. ఆయన దృష్టి అప్రయత్నంగా ఆలయ శిఖరాల స్వర్ణ కలశాలవైపు తిరిగినదని దాశరథి గ్రహించుకొన్నాడు. ఏకాగ్రదృష్టితో ఏదో విషయం పర్యాలోచిస్తున్నారని యజ్ఞమూర్తి నిశ్చయించుకొన్నాడు. అందుచేత వారిద్దరికి ప్రసంగ ప్రారంభాని కేమాత్రము అవకాశం లభించలేదు. అయితే మఠంలో దేవరాజస్వామి పూజా సమయం సమీపిస్తున్నది. అది ఆచార్యుని సమక్షంలో యథావిధిగా జరిగే అర్చన. అయినా ఆచార్యులా విషయమే తలపెట్టినట్టు కనబడలేదు! యజ్ఞమూర్తి మరి వేచిఉండలేక ఎంతో అడకువతో దోసిలికట్టి దేవరాజస్వామి పూజవేళ అతిక్రమిస్తున్నదని విన్నవించాడు. తిరిగి మఠానికి విచ్చేయువలసినదని ప్రార్థించాడు. తెలియకచేసిన తన అపరాధా లార్ద్రదృష్టితో మన్నించవలసినదని ప్రాధేయపడ్డాడు.

రామానుజుని పరిపూర్ణ దృష్టి అంతేవాసివైపు తిరిగింది. పెదవులపై చిరునవ్వులవోకగా మొలకెత్తింది:

'యజ్ఞమూర్తి! దీనిలో నీ తప్పిదమేమిలేదు. యతి ఒకే ఒకచోట చిరకాలం నివసించరాదని మన శాస్త్రాలుద్ఘోషిస్తున్నాయి. అదీగాక అక్కడ నా ఉనికివల్ల మీకందరికి ఎంతో ఇబ్బంది కలుగుతున్నట్టున్నది...మరి అనవసరంగా ఆలస్యం కానీయక త్వరగావెళ్ళి స్వామిపూజ ప్రారంభించండి!'

ఆ ప్రత్యుత్తరంతో యజ్ఞమూర్తి గుండెలో రాయిపడింది. ఆచార్య లీక మఠంలో అడుగుపెట్టరన్న విపరీత భీతి కలిగింది! అతని కేమి పాలుపోలేదు. దాశరథివైపు చూచాడు. నిలువునా నిర్ఘాంతపడి అత డలాగే ఆచార్యుని ముఖవైఖరి పరిశీలించి శిరస్సు వంచుకొన్నాడు. యజ్ఞమూర్తి కిక ఊపిరాడ లేదు! అస్పష్టస్వరంతో అత్యంత వినీత వైఖరితో విన్నవించాడు :

'రంగనాయకునికి స్వయంగా తామే మంత్రోపదేశం ప్రసాదించారు. ఇది మాకెంతో ఆశ్చర్యం కలిగించింది! మేమెవ్వరము అతని కింతటి అర్హత కలిగినదని అనుకోలేదు! నావల్ల అతని యెడల పెద్ద అపరాధమే జరిగిపోయింది.'

యజ్ఞమూర్తి ఉట్టిపడుతున్న అడకువతో తిరిగి అంజలిఘటించి వేడుకొన్నాడు. అంతలోనే రామానుజయతి తిరిగి ప్రసన్న ముఖవైఖరితో ప్రసంగించాడు.

'నాయనా! దీనిలో విడ్డూరం ఏమి ఉన్నది! శ్రీరంగేశుని అపార కృపవల్ల అతనికి జాజ్వల్యమానములయిన స్వామి సహజదివ్య విశాల నేత్రయుగళి సాక్షాత్కార భాగ్యమే లభించింది!'

ఆ ప్రతిసమాధానం వినగానే యజ్ఞమూర్తి, దాశరథి నిశ్చల పాషాణ ప్రతిమలవలె నిశ్చేష్టితులయినారు! వారెరిగినంతవరకు ఆచార్య లొక్కరికే తక్క, వృద్ధ శిష్యులెవ్వరికి అటువంటి మహాదృష్టం కలగలేదు! మఠవాసులందరిలోను వృద్ధుడు, మహా మనీషి, సౌజన్యమూర్తి అయిన గోవింద యతికి కూడా అటువంటి మహనీయ భాగ్యం లభించలేదు! ఇక రంగనాయకు డేవిధంగా ఆలోచించినా మహాపాపి! అత డంతకుమునుపు చేయని దుశ్చర్యలేదు! అపైన ఆవంతయినా శాస్త్రపాండితిలేదు! అటువంటి మోటుమనిషికి శ్రీరంగశాయి దివ్య విశాల విలోచనాల సాక్షాత్కార భాగ్యం లభించినదంటే అతని కేమాత్రము నమ్మిక కలగలేదు! కాని, ఆచార్యులే విస్పష్టంగా నొక్కి వక్కాణించిన పుడిక విశ్వసించక తప్పలేదు! అయినా అతని ముఖంలో సందేహాశ్చర్యాల చ్ఛాయ తొలగలేదు. రామానుజు డది గమనించి అలవోకగా చిరునవ్వు చిందించి ప్రశ్నించాడు:

'యజ్ఞమూర్తి! ఎందుకు నీ కింతటి సందేహం! వైకుంఠద్వార పాలకులు జయ విజయుల పురాతన గాథ విన్నావుకదా?'

'అవును! విన్నాను!'

అర్థాంగీకారస్వరంతో తలపంకించాడు యజ్ఞమూర్తి. అతని కా పురాతనవృత్తాంతం విస్పష్టంగా జ్ఞప్తికి వచ్చింది. బ్రహ్మమానస పుత్రులు సనక సనందను లొకప్పుడు వైకుంఠంలో ప్రవేశిస్తూంటే తెలియక జయ విజయు లిద్దరు వారి నడ్డు

## రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రములతోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంపగోరుతాము. అట్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరికొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్య మవుతుంది. దరిమిలా స్టాంపులు పంపిన వో రచనలు త్రిప్పి పంపబడవు.



# విశాల నేత్రాలు

కొన్నారు. ఎన్నెన్ని విధాల బ్రతిమాలుకొన్నా లోపలి అడుగుపెట్టనీయలేదు! వారికి ప్రాణం విసిగింది! భూలోకంలో జన్మించవలసినదని క్రోధ భీకరులై శపించారు. ఆ జయ విజయుల కప్పటికి సనక సనందనుల ప్రాభవం పరిపూర్ణంగా బోధపడింది! మన్నించవలసినదని కాళ్ళావేళ్ళాపడి ప్రాధేయపడ్డారు. విష్ణుదేవుని వియోగం క్షణకాలమయినా సహించలేమని మొరపెట్టుకొన్నారు. చిట్టచివరికి సనక సనందనులకిద్దరికి వారిమీద జాలికలిగింది. సత్పూరుషులై ఆరు జన్మలలో తిరిగి వైకుంఠద్వారం చేరుకొంటారా? లేక పరమ దుర్మార్గులై మూడు జన్మలలోనే చేరుకొంటారా? అని ప్రశ్నించారు. జయ విజయులు మూడు జన్మలలోనే తిరిగి స్వకీయ స్థానాలలో ప్రవేశించవలెనని నిశ్చయించుకొన్నారు. క్రమక్రమంగా హిరణ్యాక్ష హిరణ్య కశిపులై, రావణ కుంభకర్ణులై, శిశుపాల దంతవక్త్రులై మానవ లోకంలో అవతరించి శాపవిముక్తి సంపాదించుకొన్నారు. ఆ వృత్తాంతం యజ్ఞమూర్తి స్మృతి వీధిలో క్రొక్కారు మెరుపులా మెరిసింది. ఎంతెంతటి పాపాత్ములయినా ఒక్కొక్కప్పుడు సజ్జనులకన్న శీఘ్రంగానే పరమేశ్వర సాన్నిధ్యం చేరుకోగలరని ఆచార్యులు ఆ గాథ ద్వారా సూచిస్తున్నారని యజ్ఞమూర్తి గ్రహించుకొన్నాడు అందుచేత రంగనాయకుని శ్రీ రంగశాయి దివ్య నేత్రాల సాక్షాత్కార సాధనలో ఆశ్చర్యమేమి లేదన్నట్లు ఆయన తన కుపదేశిస్తున్నారని కూడా యజ్ఞమూర్తికి స్ఫురించింది. కాని, అతని నిశిత తార్కిక దృష్టికిమాత్రం సంపూర్ణ సంతృప్తి కలగలేదు. రంగనాయకునికి జయ విజయులతో సామ్యమేమిటి? ఇతడెక్కడ? వారెక్కడ? అదీగాక సనకసనందనుల శాపానుగ్రహ శక్తివల్ల వైకుంఠద్వారపాలకుల కటువంటి అదృష్టం కలిగి ఉండవచ్చును! కాని రంగనాయకుడు రంవతయినా వారితో సరిపోలగలడా? సక్కు ఎక్కడ? నాకలోక మెక్కడ? అని లోలోపల ప్రశ్నించుకొన్నాడు. కాని, తిరిగి దోసిలికట్టి వెర్లి విరిసిన వినయంతో లోలోపలి జిజ్ఞాస వ్యక్తీకరించుకొన్నాడు:

'నే నీ పురాతన వృత్తాంతం చాలాకాలం క్రితమే విన్నాను. కాని, ఆ జయ విజయు లెక్కడ? రంగనాయకుడెక్కడ? అపూర్వమయిన తమ ఆశ్రిత పక్షపాతమే అతని కింతటి అదృష్టం కలిగించి ఉండవచ్చునని అనుకొంటున్నాను.'

రవంతసేపు రామానుజయతి తన మౌనముద్ర విడిచి పెట్టలేదు. తిరిగి అలతి నగవుతో అంతేవాసి ముఖ వైఖరి పరిశీలించాడు:

'యజ్ఞమూర్తీ! రంగనాయకుని యెడల నాకేదో వర్ణమాలిన పక్షపాతం కలిగినదని మీరందరు అనుకొంటున్నట్లున్నారు! కాని నా కెవ్వరిమీద రవంతయినా అటువంటి దృష్టి లేదు. అనన్య సామాన్యమయిన ఎడతెగని తపనవల్లనే అతని కంతటి మహాదృష్టం కలిగింది.'

యజ్ఞమూర్తికా ప్రత్యుత్తరంలోగల పరమార్థమేమాత్రము బోధపడలేదు. కనక తిరిగి శిరస్సొకించుక వంచుకొని ప్రశ్నించాడు:

'నాకు తమ అభిప్రాయం తిన్నగా అవగాహన కాలేదు!'

రామానుజయతి గభీర వాత్సల్యపూర్ణదృష్టితో తిరిగి ప్రసంగించాడు:

'నాయనా! దీనిలో బోధపడకపోవడానికేమి ఉన్నది? రంగనాయకుడు హేమసుందరికోసం రాత్రింబగళ్లు అదేపనిగా పరితపించాడు. ఎక్కడ దారితెన్ను కన బడక శ్రీరంగనాథుని కామె నేత్రాలతో తుల తూగగల బంగారు కన్నుల జంట సమర్పించగలనని మొక్కుకొన్నాడు. లోక పావని ఆకాశ గంగానది వరద వెల్లువవలె తీవ్రాతి తీవ్రమయిన ప్రవాహానురక్తి అతని హృదయంలో ఉప్పొంగింది! మరి దానితో అతనికిక ఊపిరాడ లేదు!—క్రమక్రమంగా అదే అతని కిటువంటి మహనీయ భాగ్యం ప్రసాదించింది! హేమసుందరి కూడా ఎన్నెన్ని కష్టాలెదురుపడినా అతని వెన్నడు విడిచిపెట్టలేదు! వాస్తవానికి వారిద్దరు వివాహితులు కారు. కాని పుణ్య దంపతులయినట్లే భావించు కొన్నారు. అంతేకాదు! ఎంతెంతటి తప్పిదాలు చేసి నట్లు తెలిసినా వారి కొకరొకరి యెడల అన్యోన్యత ఆవంతయినా సడలలేదు! అంతటి అతిలోకమయిన ప్రేమానుబంధంవల్లనే వారిద్దరికీ అనాయాసంగా అష్టాక్షరీ, మంత్రోపదేశం లభించింది. ఇంకొకమాట! మల్ల విద్యపై అనితర సాధారణమయిన ఏకాగ్రత కూడా అతని కెంతో తోడుపడింది! అంతేగాని దీనిలో నా పక్షపాత మేమాత్రములేదుసుమా!'

యజ్ఞమూర్తి పట్టరాని ఆశ్చర్యావేశంతో తల మునకలయినాడు! భక్తిజ్ఞాన కర్మ యోగాలన్న మూడే మూడు మార్గాలలో మానవుల కందరికీ పరమేశ్వర సాక్షాత్కారం లభించగలదని అతడంతకుమునుపు అవగాహన చేసుకొన్నాడు. కాని ఆచార్యులీనాడు ప్రగాఢమయిన కామినీ వ్యామోహం కూడా స్వామి సాక్షాత్కార సాధని కొక పెద్ద మెట్టుగా పరిణమించినట్లు ప్రసంగిస్తున్నారు. ఇదేమిటీ విడ్డూరం! అని తనలో తాను ఎంతయినా ఆశ్చర్యపడ్డాడు. అదీగాక రంగనాయకు డొక సామాన్య కర్షకుని కుమారుడు. అంతేకాదు! అంతకుమును పాతడు చెయ్యని దుష్కార్యంలేదు! హేమసుందరి కేవలం హీనమయిన మనుగడ కొనసాగించుకొన్న వారాంగన! కాని అతి లోకమయిన ఆమె ప్రేముడివంటి అనురక్తి లోకంలో ఇంకెక్కడ లేదన్నట్లు ఆచార్యులెంతో గౌరవంతో ప్రశంసిస్తున్నారు! అదీగాక మల్ల విద్యాభినివేశం వల్ల ఏర్పడిన ఏకాగ్రత కూడా రంగనాయకునికి శ్రీ రంగేశుని దివ్య విలోచనాల సాక్షాత్కృతి కెంతో తోడుపడినట్లు సమర్థిస్తున్నారు! యజ్ఞమూర్తి ఆలోచనా పరంపర లావిధంగా మెరుపుల తోరణంలా సాగిపోయాయి! అంతేగాని ఆచార్యుని ప్రసంగంవల్ల అతని కేమాత్రము సంతృప్తి కలగలేదు! క్రమక్రమంగా లోలోపల తీరని జిజ్ఞాస ఇనుమడించింది. మరి భరించలేక తీవ్రంగా బొమముడి విరిచి ప్రశ్నించాడు:

'తమవంటివారితో నే నేమని ప్రసంగించగలను! హేమసుందరీ రంగనాయకులవంటివారి కింతటి అదృష్టం కలిగిస్తు డిక లోకంలో ధర్మాధర్మాల మాటేమిటి? నాటికిక తిలోదకాలు విడిచిపెట్ట వలసినదేనా?'

మరికొంతసేపటివరకు రామానుజుని ముఖతః ప్రత్యుత్తరం వెలువడలేదు! మిక్కిలి జటిలమయిన తన ప్రశ్న కాచార్యు లేవిధంగా సమాధానం చెప్ప గలరో అన్న తహతహతో యజ్ఞమూర్తి ప్రతి సమాధానంకోసం నిమేషమొక యుగంగా నిరీక్షించాడు. అంతలోనే రామానుజుని వదనంపై దరహసితం తరళించినది:

'నాయనా! యజ్ఞమూర్తీ! మహాతార్కికుడవు! నీకు నేనేమని ప్రతిసమాధానం చెప్పగలను! నా కిటువంటి జిజ్ఞాస కలగకపోలేదు! కాని చాలా కాలానికి పూర్వమే నా కొకనాడు స్వామి కారుణ్య దృష్టి. మనం పతితులని అనుకొన్న వారిమీదనే ఎక్కువ ప్రసరించినట్లు గోచరించింది! ఆనాటినించి నే నీ ధర్మాధర్మ నిర్ణయభారం స్వామిమీదే విడిచిపెట్టి, ఆయన సంకల్పం ప్రకారమే నడుచుకొంటున్నాను. అయితే లోక దృష్టిలో న్యాయ్యాన్యాయ్యాల వివేచనము, దాని కనుకూలమయిన నడవడిక మిక్కిలి ఆవశ్యకములే! నీ వన్నది యథార్థమే! కాని నే నిక ఆ గోడే తల పెట్టడంలేదు!'

ఆ ప్రత్యుత్తరం యజ్ఞమూర్తికి కొంతవరకే సంతృప్తి కలిగించింది. చిరకాలంనుండి శ్రీరంగ శాయి సాక్షాత్కార సంపత్తి కధీశ్వరులయిన ఆచార్యులాయన సంకల్పం ప్రకారం తమ మనుగడ కొనసాగించుకోవచ్చును! వారి కది నిష్కంటకమయిన రాజమార్గమే కావచ్చును! కాని తనవంటి సామాన్యులకిక ధర్మాధర్మ నిర్ణయంలో దిక్కెవ్వరు!? అని లోలోపల రవంతసేపాలోచించుకొన్నాడు. అప్పుడే ఆచార్యుని సమక్షంలో ఆ జిజ్ఞాస వ్యక్తీకరించవలెనని అనుకొన్నాడు. అంతలోనే శ్రీ రంగేశుని గర్భాలయంలోనుండి వెలువడిన గభీర ఘంటాధ్వని ఆ ప్రాంతంలో నలువైపుల ప్రతిధ్వనించింది. అంతలోనే అతనికి ఆనాటి దేవరాజస్వామి పూజవేళ బాగా మించిపోగలదేమో అని లోలోపల విపరీతమయిన ఆందోళన చెలరేగింది. అందుచేత మరి ఆ జిజ్ఞాస వెల్లడించలేదు! అంతలోనే తిరిగి రామానుజయతి మంద్ర గభీర కంఠధ్వని అతని వీనుదోయిలో మారుమ్రోగింది.

'యజ్ఞమూర్తీ! నీ జిజ్ఞాస నా కవగతమయింది! నీవేదో అడగవలెనని అనుకొని కొంచం సంకోచిస్తున్నట్లున్నావు. నిశ్చల భక్తితో నిరంతర చిత్తశుద్ధితో దారి చూపించవలసినదని స్వామిని వేడుకొన్నప్పుడు ధర్మాధర్మ సందేహం క్షణంలో మంచువిడిచిపోయినట్లు విడిపోగలదు! స్వయంగా శ్రీరంగేశులే నీ చెయ్యి పట్టుకుని నడిపించుకుపోగలరు! నే నొకప్పుడు శ్రీరంగంలో దీనాతిదీనులయిన పతితుల దుస్థితిచూచి కుమిలి కుమిలి దుఃఖించాను. స్వామి సన్నిధికిపోయి, 'అయ్యో! వారి కిక దెక్కెవ్వరు స్వామీ!' అని మాటి మాటికి మొర పెట్టుకొన్నాను. అప్పుడు నా కా కృపానిధి దివ్యమూర్తి చేతులెత్తి లోకంలో మానవుల నందరిని కౌగలించుకోబోతున్నట్లు సాక్షాత్కరించింది! ఆయన కుడిచేయి సజ్జనులవైపు తిరిగింది. ఎడమచేయి పతితులయిన పాపులవైపు తిరిగింది. అయితే ప్రగాఢ కారుణ్యంతో సంచలిస్తున్న ఆ బాహువు కుడిచేతికన్న కొంచెం ఎక్కువవగానే ఒరిగినట్లు కనబడింది. నాటినించి నా సందేహం

# విశాల నేత్రాలు

పటాపంచలయింది!’

యజ్ఞమూర్తి ఆ ప్రసంగం విని నిలువునా నిర్ఘాంతపడి ‘స్వామి స్వయంగా మార్గ దర్శకులయినప్పుడు సంశయాల కవకాశమే లేదు! కాని నావంటి అజ్ఞాన జాత్యంధుల కిక దిక్కెవ్వరు?’ అని లోలోపల వితర్కించుకొన్నాడు. ఉపాయాన్ని విశ్వసించి చేతులుజోడించి విన్నవించుకొన్నాడు:

“మీరన్నది అక్షరశః యథార్థమే కావచ్చును. కాని మావంటివారి కడుగడుగునా సందేహాలే! అయితే దేవరాజస్వామి అర్చనవేళ అతిక్రమిస్తున్నది! మీ కోసం గోవిందయతి పడిగాపులుపడి కూర్చుని నిరీక్షిస్తున్నారేమో!’

అంతటితో రామానుజుని ముఖంపై గంభీర మౌనముద్ర సాక్షాత్కరించింది.

‘సర్వసమర్థులయిన మీ రుభయులు ఉన్నారు గదా! మొట్టమొదటే అన్నానుకదా! యతి చిర కాలం ఒకేఒకచోట నివసించరాదని! నాయనా! మరి ఆలస్యం చెయ్యక మీ రిద్దరు త్వరగా తిరిగి వెళ్ళండి!’

ఆ ప్రత్యుత్తరంతో యజ్ఞమూర్తి నాలుక పిడచకట్టుకుని పోతున్నట్టయింది! మరి ఆవేదన సహించలేక పాదాలపై వాలి తెలియక చేసిన తన తప్పిదం మన్నించి తిరిగి మఠానికి విజయం చెయ్యవలసినదని ప్రాధేయపడ్డాడు. అయినా ఆచార్యుని గభీర మౌనధోరణి సడలలేదు. యజ్ఞమూర్తి గత్యంతరం కానలేక దుర్భర దైన్యంతో దాశరథి వైపు చూశాడు. అంతవరకు ఏకాగ్రదృష్టితో వారి ప్రసంగం విన్న ఆ మౌని అల్లన నవ్వి, మిక్కిలి అడకువతో దోసిలికట్టి విన్నవించాడు:

‘స్వామి అడుగడుగునా మీకు మార్గదర్శకులు! అదేవిధంగా మీరు మాకందరికి సర్వదా సంరక్షులు! ఇటువంటివారు మీ రక్కడికి అడుగుపెట్టనప్పుడది మఠం కానేకాదు! మీ రెక్కడఉంటే అదే మా శ్రీవైష్ణవమఠం! మరి మే మక్కడికి మరలిపోదలుచుకోలేదు!’

అతని దృఢ నిశ్చయ వైఖరి గమనించి రామానుజ యతి క్షణకాలం నిర్ఘాంతపడి అల్లన నవ్వి ప్రసన్న మధురస్వరంతో ప్రసంగించాడు:

‘దాశరథీ! మొట్టమొదట నేటినుంచి భిక్షాటనంతోనే కాలక్షేపం చెయ్యవలెనని అనుకొన్నాను. కాని మిమ్మల్ని అందరిని విడిచిపెట్టి నే నెక్కడికి పోగలను! దేవరాజస్వామి నా పాదాలింతకు పూర్వమే మీతోబాటు బంధించి తమ బందీగా చేసుకొన్నారు!’

వారిద్దరికి ఆ ప్రతిసమాధానంతో ప్రాణంలేచి వచ్చినట్టయింది! దాశరథి భుజంమీద ఆనుకొని రామానుజయతి నెమ్మదినెమ్మదిగా తిరిగి మఠంవైపు సాగిపోయాడు. కాని వారిద్దరిని అనుసరించిన యజ్ఞమూర్తి హృదయంలో తీరని జిజ్ఞాసా మథన అదే విధంగా చెలరేగింది!

—ఇంకా ఉంది.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra PatrikaPress 6 & 7, Thambuchetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

